# తప్పని ముగింపు

౮

## ఎల్. మాలకొండయ్య

ప్రచురణ:



'TAPPANI MUGIMPU' by L. Malakondayya M.A., I.A.S.

# తప్పని ముగింపు

మొదటి ముద్రణ:

డిసెంబరు 1982

ప్రతులు 2,000/-

ముఖపత్ర రచన:

శీలా వీర్రాజు

ప్రతులకు

దేశి బుక్ హౌస్

నారాయణగూడ,

హైదరాబాదు-500 027.

2) ఎల్. శ్రీనివాస్

94-శ్రీనగర్ కాలనీ, హైదరాబాద్-500 873.

వెల రూ. 10/-

ముద్రణ:

జి.వి.ఎస్ & కో, ప్రింటర్స్ & పబ్లిషర్స్ రాంనగర్, హైదరాబాద్-500 044.

# చూసిందే రాసింది

నేనెరిగిన మాలకొండయ్యగారు ఓ పథకం వేసుకుని కవిత్వం రాయరు. ప్రభుత్వాధికారిగా ఆయన పనిచేసే శాఖల్లో ఎన్నెన్నో పథకాలున్నా, ప్రణాళికలున్నా నిర్వర్తించినా కవిత్వం దగ్గరికి వచ్చేసరికి ఆయన స్వచ్ఛందశీలి. ఒక్కసారి ఈ సంపుటిని తిరగేస్తే నేనన్న విషయం రుజువవుతుంది.

పుట్టుకను సంబోధిస్తూ ప్రారంభమైన ఈ సంపుటి మృత్యువివేచనతో ముగుస్తుంది. అసలు ఆ శీర్షికలు చూస్తేనే ఇందులోని వైవిధ్యం స్పష్టంగా కనిపిస్తుంది. ఆకాశకన్య, ఆంధ్రవ్యాసుడు, అందాల దొంగ, ఆలితో అబద్ధం, గోవా గొప్పలు, డార్లింగ్ డార్లింగ్, పాపం పుణ్యం, హతం ఖతం—ఇలా ఇలా.

మాలకొండయ్యగారు లోకంలోని ప్రతిసంఘటనకూ, అగుపించిన దృశ్యానికీ స్పందించే గుణమున్న నాజూకు మనసున్నవారు. ఒకరికి తాము ఉన్నతాధికారిగా వుంటూనే కార్యాలయాల ఫైళ్ళ మడతల్లో మగ్గే ప్రజల అర్జీల గురించి ఇలా వ్రాస్తున్నారు—

"కలాలు వ్రాస్తూనే వుంటాయి తీరిక లేకుండా
కాగితాలు పొడుగుతూనే వుంటాయి
ధూళికంబళి కప్పుకుని ఆఫీసు అల్మారాల్లో
ప్రజల గోడులు పడివుంటాయి అలాగే"

ఇది కాల్పనిక కవితా సత్యం కాదు. ప్రతిదిన ప్రత్యక్ష పరమ నగ్నసత్యం. మాలకొండయ్యగారి ప్రవృత్తి కల్పనకంటే. శిల్పంకంటే వాస్తవికతపట్ల, సర

శాభి వ్యక్తిపట్ల మొగ్గుచూపుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ అభివ్యక్తి వచన సూక్తిగా మారిపోతూ వుంటుంది. అయినా కవితాస్పర్శ ఉన్న కలం ఆ సమానం సూక్తుల్నే ప్రసవించదు. గుండెను హత్తుకుపోయే ఆలాపనలను కూడా ప్రసరి స్తుంది చూడండి ఈ సంపుటిలోని 'కాలం కుంచె'లోని కొన్ని పంక్తులు—

"తీరపు ఇసుకపై
ప్రవాహపు బాధలగాథలు.
అలల వెల్లువలు
హత్తుకున్నాయి వాటిని హృదయానికి.
కడిగివేశాయి నాలోని కల్మషాన్ని."

ఇందులోని తీరం కాలప్రవాహం ఒడ్డు. అలలు సంఘటనలు. బాధలగాథల్ని అవి లోబరుచుకున్నాయి. కవిగుండె కడిగివేసినట్లయింది. ప్రశాంతత. సమ చిత్తత.

ఈ సంపుటిలో అక్కడక్కడా మెరిసిన మెరుపుల్ని ఈపీఠికపైకి ఎక్కిం చడం నా అభిమతం కాదుగాని అందరూ అనుకునే ఒక సార్వజనీన సత్యాన్ని మిత్రులు మాలకొండయ్యగారు ఎంత ఆర్ద్రంగా చెప్పారో చూడండి.

శీర్షిక 'ప్రత్యక్ష దైవం'.

"దేవుడు సర్వత్రా
ప్రత్యక్షం కావడం
దుర్లభం కనుక—
ఎల్లవేళల పిల్లలకు దైవంగా
తల్లిని సృజించాడు."

ఇది ఒక సుపరిచిత సుప్రతిష్ఠిత సత్యానికి చేసిన వ్యాఖ్య.

మూలగ్రంథమ్ముగాను పావిత్ర్యం నిల్పించడానికి ప్రయాస పడ్డట్టు అనిపించదు. అంతరంగా వెలువడిన అభిప్రాయాలను, అంత సూటిగా అందరికీ అర్థమయ్యే శైలిలో చెప్పాలనే తపన ఉన్నవారు. వారి ఈ తపన రానురాను పరిమాణంలో మరింత పెక్కుమడి వెలువడుతుందని ఆశిస్తున్నాను.

—డా॥ సి. నారాయణరెడ్డి

అధ్యక్షులు

అధికారభాషా సంఘం

# "మాలకొండయ్య మాట నిజం"

నేటి తెలుగులో సూటిగా నీటుగా గద్యాన్ని పద్యంగా మలచే గడుసు దనము మాలకొండయ్యగారి ప్రత్యేక శిల్పం.

కవిత్వానికి ఎన్నో నిర్వచనాలు. ఎందరో ఎన్నో విధాలుగా విశ్లేషించారు, వివరించారు.

"వాక్యం రసాత్మకం కావ్యం"

"నలువగల వెన్నెలం చెలువునకు సౌరభము
కలిగినను సౌరభముఁ జలువయు దలిర్పం
బోలు పెనఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభము చలువ పసయుం గో
మలతయును గలిగి జనముల మిగులం బెంపెనగు
మలయ పవనంపుఁ గొదములకు మధురత్వం
బలవడిన నీడు మరి కలదనఁగవచ్చుఁ గను
వెలయఁగల యీ సుకవి పలుకులను నెంచన్."

"పూత మెఱుంగులున్ పసను
పూవ బెడంగులు జూపునట్టి వాక్యైతలు
జగ్గు నిగ్గు నెసగావలె ...............
దా తొడ తున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ వాకటిన్

కమ్మనౌ పాటల పొందుపరచునటె
పాడవె గానలె పండువాడినన్ "

" హరచూడా హరిణాంక వక్రతయు కాంత
స్ఫురద్ స్ఫటికా వరము ద్గాఢ వయోధర
స్ఫుటదయే పర్యంత కాఠిన్యమున్ "

" సత్కావ్యము దిక్కులన్ సరసత్వంబున సాధువించెననగా
చిరకాలంబు నడచు అపిరాజీ గేహ రంగంబులన్"

ఇలా ఎన్నో విధాల కవిత్వ ప్రయోజనాలను ప్రవచించారు.

కవిత్వతత్వంలో నవీన యుగంలో విశ్వసాహిత్యంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆంధ్ర వాఙ్మయంలో ఎన్నో విప్లవాల పోకడలు ప్రతిఫలించాయి. తత్ఫలితంగా సులక్షణసారముతో నిమిత్తములేని సంక్షిప్త వచన కవిత్వ సాంప్రదాయం నేటికి మేటిగా ప్రాచుర్యాన్ని, ప్రాభవాన్ని, ప్రచారాన్ని పొందింది. వచన కవితకు స్వంత రాగం, స్వంత తాళం, స్వంత దారి సంపాదించుకొన్న వారిలో మాలకొండయ్యగారు ఒకరు. ప్రౌఢ సమాస విన్యాసాలు కాని పాండిత్య ప్రకర్ష గాని, నర్మోక్తులు, వక్రోక్తులు, అలంకార ప్రయోగము అవసరములేని నగటు పాఠకుడు సంపూర్ణంగా పరిగ్రహించ గలిగే కవిత వీరి ప్రత్యేకత.

" ఒకనాటి వ్రాతలు " ఖండికలో తన కవితాశయాన్ని కొట్టవచ్చినట్లు చెప్పారు.

" వ్రాశారు కావ్యా లనేకాలు
గీశారు గీతలు చాలా

అందున్న సారాంశమేమిటి ?
అవధాని అంగ వర్ణన
కాష్ట చెప్పులు లేని కట్టు కథలు..........."

" అన్నిట్లో అతిశయోక్తి మిన్న
అనుభవ దూరమైన వ్రాతలు
ఆపైగా అన్నీ అనువాదాలు ! అనుకరణలు !
అయినా చేశారు సాహిత్య సేవ
మరిచారు మానవ కల్యాణం........."

"కవి - అక్షరం" అన్న ఖండికలో:

" కాలం ఇక్కడ, కవి ఎక్కడో కాకుండా
పదంతో గళం కలిపి
కలంతో కదం తొక్కేలా
అక్షరమా సమకూర్చు
సరిగమల తోరణాల సమాధానం
ప్రజా శ్రేయస్సు కాధారం. "

"కలం - గళం" అన్న ఖండికలో:

" కదం తొక్కుతుండే కలం
పదం పాడుతుండే గళం
కావా కవిత్వం ... ... ... ...
... ... ... ...
పొందలేదా కవి అమరత్వం "

వచన కవితలో కూడా వంచనా శిల్పానికి పాల్పడే మహానుభావు లెందరో! అర్థం కాని అయోమయమైన ఊహల సంకల్పన

" అగమ్యతమో రహస్యాంగణాలలో "

అంతర్థానమయ్యే పద్ధతిలో కాక లలితమైన భాషలో సహజంగా, సాకల్యంగా చెప్పడం ఈకృతి, ప్రతి ఖండికలోను వినిపిస్తుంది, కనిపిస్తుంది.

ఉదాహరణకు "ప్రేమ" అనే ఖండికలో:

"తప్పొప్పుల జాబితా వేయకుండా
మనిషిని మనిషిగా ఒప్పుకోవడమే ప్రేమ..."

—ప్రేమకు నిర్వచనం.

"అబద్ధానికి ఉన్న విలువ
భార్యలముందే కాక
ఎవ్వరిముందూ ఎన్నడూ
నిజానికి లేనేలేదు!
మరి ఆలితో అబద్ధం ఆడకుంటే
కాదా సాగించేని సంసారం!"

ఇది "ఆలితో అబద్ధం" అనే ఖండిక.

"మనిషికి దేవుడు మనిషిలా ఉంటే
చీమకు, దోమకు ఎలా ఉండాలి?"

"దేవుడు - మనిషి" అన్న ఖండికలోనిది.

"పనిని పూర్తిచేయడమే విశ్రాంతి
సమయాన్ని సరిగా ఉపయోగించడమే విశ్రాంతి
అవసరమైన విశ్రాంతి జీవితానికి క్రాంతి !"

" విశ్రాంతి - క్రాంతి " అనే ఖండికలో.

" ఆఫీసర్ల సెండరుకో పేరాదు
ప్రమోషన్లు ఎందరికో వచ్చాయి
కాగితాలకు సిరాలకు ఖర్చులు ఎన్నో పెట్టారు.
కలాలు వ్రాస్తూనే ఉంటాయి తెరిపి లేకుండా
కాగితాలు పెరుగుతూనే ఉంటాయి
బూజు కంపు కప్పుకొని ఆఫీసు అల్మారాల్లో
ప్రజల గోడులు పడి ఉంటాయి అలాగే
పేదవాళ్ల కోరికలు మూలుగుతూ ఉంటాయి చిరస్థాయిగా !"

" నల్ల దొరలు " ఖండికలో.

" అత్తల దృష్టిలో కోడళ్లు కొంటె వాళ్ళైనా
వసుమక్ష మహానుభావులే !"

" అత్తలు - కోడళ్ళు " ఖండికలో

" నేటి ప్రపంచంలో
అన్నీ అద్దెకే
చివరకు పెళ్ళి, పెళ్లాం, పిల్లలు
అద్దెకు కావాలంటే
అలుసుగా దొరికే రోజులొచ్చాయి !"

" అన్నీ అద్దెకే !" అన్న ఖండికలో

" విమర్శను విశదంగా పరిశీలించాలి
ఆలోచించాలి అందులోని అంశాలను
నేర్చుకోవాలి పాఠం
విమర్శ వల్ల
మంచి మాటలు మనలను
సంతోష పరుస్తాయి
కానీ ఆలోచనలకు
అభివృద్ధి కి అడ్డుగోడలుగా నిలుస్తాయి"

" అడ్డుగోడలు " అనే ఖండికలో,

" గురిలేని కాల్పులకు
అర్థం లేని నరుకుళ్లకు
ఆహుతి అయినారు
అమాయక ప్రజలు
అర్థమేమిటి దీనికి
ఆ మతంలో ఒకడు హతం
ఈ మతంలో ఒకడు ఖతం
అని తప్ప ? "

" హతం – ఖతం " అన్న ఖండికలో,

" మంచిగా మసులుకో నువ్వు
మనిషి నిన్ను మెచ్చి చూస్తే ఒట్టు
తిట్టు, కొట్టు, తిప్పలెన్నో పెట్టి చూడు
ప్రతి దినం నీకు పూజ చెయ్యకుంటే ఒట్టు "

" నేటి సమాజం " అనే ఖండికలో,

" అందరినీ మెప్పించడమే ఆశయమైతే
ఎవరినీ నొప్పించ రాదనే సూత్రముంటే
పరిపాలన సాగే దెలా ?
సంసారం చక్కబడే దెలా?
అధికారం అంతా స్వంతానికే అయితే
అవకాశాలన్నీ బంధుమిత్రులకే అంకితం అయితే
పేదల బ్రతుకుల ప్రమిదెలు వెలిగేదెలా?
పేదల కడుపులు నిండేదెలా?

"కన్నులు అద్దెకు ఇస్తే" అన్న ఖండికలో.

ఇలా అక్కరకురాని మాటకాని, అర్థంకాని, భావం కాని లేని ఖండికల సంపుటి— తప్పని ముగింపు:

అందమైన ఆటవెలదిలో అందరికీ అర్థమయ్యే దేశకవితలో తెలుగునాట వేమన నాటిన కవితా సాంప్రదాయాన్ని సమన్వయం చేసుకొని సహజంగా వ్రాశారు మాలకొండయ్యగారు. "మాలకొండయ్య మాట నిజం" అనే మకుటంతో వ్రాస్తే బాగుంటుందేమో!

—ఇ. అయ్యపురెడ్డి
న్యాయవాది మరియు ఎం.ఎల్.ఏ.

# "ముగింపు" లో తెగింపు

కళాప్రపూర్ణ
—డాక్టర్ దాశరథి
(ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి)

చెరకు గడను ఖండఖండాలుగా నరకకుండా నమిలి రసం గ్రోలగలమా? అందుకే ఆధునిక కవిత ఖండఖండాలుగా కనిపిస్తుంది. ఖండకావ్యాలుగా అవతరిస్తుంది.

ఖండాలన్నీ కలిస్తే ఇక్షుదండం!
ఇక్షుదండాన్ని ఖండిస్తే ఇక్షుఖండం!

మాలకొండయ్యగారు మనకు అందనంత యెత్తైన కైతల,మాలల,కొండ!

అయితే, తాను సులభుడై, మాలలు మాలలుగా తనను అల్లుకుని, నేలకు దిగివచ్చి, పాఠకుడికి అందుబాటులో వుంటున్నాడు. అదీ ఆయనలోని సౌలభ్యం, అదీ ఆయనలోని నమ్రత, కమ్రత కూడా.

కావాలంటే, పాఠకుణ్ణి గజిబిజి పరచే నాలుగు నైఘంటుక (మూలగొట్టు) శబ్దాలు వేయలేడా? అధివాస్తవికత పేరిట అయోమయం చేయలేడా?

అది ఆయన మనస్తత్వంకాదు. యోగి వేమన్నను, మానవీశ్వర సమాన భూయిష్ట మత్తేభ శార్దూలాల్ని వ్రాయమంటే యెలా వుంటుంది?

మాలకొండయ్యగారు మాలకొండయ్యగారే అనిపించుకున్నారు. మాల కొండయ్యగారు 'ఆయన్ని అనుసరించాడు, ఈయన్ని అనుసరిస్తాడు' అనిపించు కోలేదు. "ఆంటరి కవులమీదా వారి ప్రభావం వుంది, పీరి ప్రభావం వుంది. ఫలానా వారి ప్రభావం నుండి నల్లభైయేండ్లుగా కవులు తప్పించుకోలేక పోతు న్నారు" అంటుంటారు కొందరు. అందులో సత్యం లేకపోలేదు. కాని ఆ సత్యం మా మాలకొండయ్యగారికి వర్తించదు. ఆయనకు భావమేగాని ఇతరుల ప్రభావం లేదు.

సుప్రసిద్ధకథకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారిని గురించి చెబుతూ వుంటారు — "ఆయనపై పాశ్చాత్య కథా సాహిత్య ప్రభావం బొత్తిగాలేదు. He is as original and fresh as the morning sun. అని. అవును, ఆయనకు పాశ్చాత్య కథాసాహిత్యం దేనికి? ఆయన కథలకు కొలెకు సామగ్రి తెలుగు ప్రజల్లో వుంది, తెలుగుదేశంలో వుంది, ఆ సామగ్రిని ఉపయోగించు కోగల శక్తి వుంది.

ఇది అక్షరాలా మా మాలకొండయ్యగారికీ వర్తిస్తుంది. ఆయనకు తన కవితాసామగ్రిని యెవరినుండో,యెక్కడినుండో యెరువు తెచ్చుకోనవసరంలేదు. He is original to the core His life is his knife which cuts very deep into the present day complex society and exposes the wound the problem

మాలకొండయ్యగారి తొలి రచననుంచి ప్రస్తుత కవితాసంపుటం దాకా పరిచయం కలవాణ్ణి నేను. కనుక ఈ మాటలు వ్రాశాను ధైర్యంగా.

కథా, కావ్యమూ విడిపోయాక, కథా కావ్యాల అస్తిత్వం అస్తమించింది. కనుక మాలకొండయ్యగారి కవితల్లో కథలేదు; వ్యథవుంది. సుధవుంది. మనకు కావలసింది వ్యథ, సుధ. వ్యథలో నుంచి సుధ ఉద్భవిస్తుంది. క్షీరసాగరమథనం లో యెంతవ్యథవుంది? అందులోనుంచి యెంతసుధ వెలువడింది! కార్యాలయంలో, ప్రయాణంలో, పడకగదిలో, యెక్కడవ్రాసినా, మాలకొండయ్యగారి హృదయ క్షీరసాగరాన్ని ఆయన లేఖిని కవ్వపుకొండ (మందర పర్వతం)లా అవిచ్ఛి న్నంగా చిలుకుతూ, మనకు కవితా సుధను అందిస్తుంది.

వ్యథాభరిత వసుధకు కావలసింది సుధ.

మాల కొండయ్యగారి హృదయవ్యథను గురించి రెండు పంక్తులు ఉదహరిస్తే పాఠకులకు అవగతం అవుతుంది.

"అక్షరాలు అరుస్తున్నాయి.
వాక్యాలు కేకలు వేస్తున్నాయి"

"అక్షరం తక్షణం కళ్లు తెరవమంటుంది
వాక్యం మనసు విప్పి పలకమంటుంది"

— అక్షరాలు (పుట 5)

మనసు విప్పి పలికే వాక్యం, కావ్యం.

మాలకొండయ్యగారు మనసు విప్పకుండా పలకలేరు. అది ఆయన మనస్తత్వం. కనుక ఆయన వ్రాసిన ప్రతి వాక్యంలో కావ్యం ధ్వనిస్తుంది.

అలతి అలతి మాటల్లో అద్భుతవ్యంగ్యం కుదించగల శక్తి, మాలకొండయ్య గారిలో చూచిన నేను, చాలా సందర్భాల్లో ఆయన అశేష ప్రతిభకు ఆశ్చర్యపోయాను.

ఉదాహరణకు "రామాయణ సారం" చదవండి (పుట 13).

విభీషణుణ్ణి గూర్చి ఆ కవితలో మాలకొండయ్యగారు అన్న గొప్ప మాటలు మాటి మాటికి నాకు జ్ఞాపకం వస్తుంటాయి,

"అన్నకు ద్రోహం చేసేనట!
అతడే గొప్ప దేశభక్తుడట!! "

సహజ కవి గనుక, అశేషప్రతిభాశాలి గనుక, శ్రీ మాలకొండయ్య అలా కొత్తగా ఆలోచించగలిగారు. అందరికీ ఆ ఆలోచన తట్టదు.

'అది వక్రదృష్టి' అని ఎవరైనా అనవచ్చు. నా దృష్టిలో ఇది వక్ర దృష్టికాదు. వక్రోక్తి మాత్రమే. ఏకోక్తి కవితకు శోభ చేకూరుస్తుంది.

"వక్రోక్తిః కావ్య జీవితం"

ఇది, కుంతకుడనే ఆలంకారికుడు అన్న వాక్యం.

"వక్రోక్తి, కావ్యానికి ప్రాణం" అన్నాడాయన.

నిజానికి భామహుడనే మరో అలంకారికుడు కుంతకుడికంటే పూర్వమే వక్రోక్తిని ప్రస్తావించాడు. అది మాలకొండయ్యగారి కవితకు వన్నె తెచ్చింది.

ఇక వ్యంగ్య వైభవానికి మాలకొండయ్యగారి ఈ "తప్పని ముగింపు" సంపుటిలో ఉదాహరణలు యెన్నైనా చూపవచ్చు:—

"కన్నులు అద్దెకు ఇస్తే" శీర్షిక గల కవితలోనుండి, ఉదాహరణకు మూడు పంక్తులు:—

"కన్నులు అద్దెకు ఇచ్చుకొని
చెవులకు చూపులప్పచెపితే
"నిజము తెలుసుకోవడం ఎలా?" ఉత్తమ కవితకు ఈ పంక్తులు ఉదాహరణంగా చూపితేచాలు.

ఈ సంపుటిలోని ఆఖరు కవిత " తప్పని ముగింపు " లోనూ శాశ్వత సత్యంతో తొణికిసలాడే ధ్వనిని ప్రవేశపెట్టారు కవిగారు.

"తప్పని ముగింపు" తరుముకొస్తున్నా
తయారుకాడు, మూర్ఖుడు మనిషి"

ఇవి సత్కవితా సంభరిత సత్యవాక్కులు. మానవనైజం ఎంత బాగా గ్రహించాడు కవి! ఈ గ్రహణ శక్తి కవికి మేధా గతమైనది.

"జీవిత వలయాల" నుంచి "తప్పని ముగింపు" దాకా ప్రయాణించిన కవి శ్రీ మాలకొండయ్య, కవితా ప్రయాణం సాగుతునే వుంటుంది. ఈ కవితా ప్రయాణానికి "తప్పని ముగింపు"అంటూలేదు. "గట్టులు తెంచుకుని ఉరకలు వేసే భావ తరంగిణి" కి ఫుల్‌స్టాప్ వుంటుందా?

# ఇందులో

# అంకితం

సోదర

తెలుగు ప్రజానీకానికి

# పువ్వా నవ్వాలి

పువ్వా నవ్వాలి
నువు నవ్వాలి
(నా) మల్లె మొగ్గా నువు నవ్వాలి
చల్లాలి
వెదజల్లాలి
పువ్వుల నవ్వుల
పరిమళం వెదజల్లాలి
నువు నవ్వాలి. ॥పువ్వా॥

నిన్నటి మొగ్గా
నేడే విచ్చావా ?
ఆనందం పంచావా ?
అందం అందిచ్చావా ?
నేటి పువ్వా రేపు వికసిస్తావా ?
అటుపై కాయలు కాస్తావా ? ॥పువ్వా॥

నవ్వి నవ్వి - నీ నవ్వులతో
కవ్వించాలి (ఈ) లోకాన్ని
పువ్వు నవ్వితే పులకరించదా లోకం
పువ్వుకు కోపం వస్తే
వాడి పోవదా పుడమి ?
మాడి రాలి పోవదా స్వర్గం ? ॥పువ్వా॥

# ఏమని చెప్పను

ఏమని చెప్పను
నేనేమని చెప్పను
మాధవు డంటే
రాధకు ప్రాణమని
రాధ లేనిదే మాధవు డేడనీ
మాధవు నీడయే కాదా రాధనీ ||ఏమని||

గోపీ లోలుడు
(పాపము!) రాధకు దాసుడనీ
రాధను మించిన దింకేదనీ ||ఏమని||

మురళి మోగినా
అందెల రవళి మోగినా
అందులో రాగము స్వరము రాధేననీ
(తన) పల్లవి తాళం రాధేనని ||ఏమని||

రాధా మాధవు లొకటేననీ
కాదన గలదా జగము
లేదన గలదా సృష్టి ||ఏమని||

ఎంత వేడినా
రాధను చూడగరావా
మాధవ నాబాధను బాపగ లేవా ||ఏమని||
(నా) వేదన తొలగించి
(ఈ) మోదము గూర్చరిస్వామీ ||ఏమని||

# నీ చూపు - నీ వలపు

నీ చూపూ - నీ వలపూ
నా మనసు పరవసించే
(నిజం) నా మేను పులకరించే
నీ రూపే చూడాలని కనులకు వుంది
నీ పాటే పాడాలని మనసుకు వుంది
(ఆకాశంలో) చుక్కలనే పట్టమంటావా
(అందంగా) నీ కొప్పులో పువ్వులా తురమమంటావా ॥నీ॥

చందమామనే తెమ్మంటావా
అందంగా (నీ) నుదుట తిలకంగా దిద్ద మంటావా
ఇంద్రుడినే బంధించి తెమ్మంటావా
బానిసగా నీకు మరి చేయమంటావా ?
నేలను నింగిని కలిపివేయమంటావా
నీ అందాల మేడగా కట్టించమంటావా
రవినే మరి పిలిపి చమంటావా
నీ కవిగా చేయమంటావా ॥నీ॥

వెన్నెలనే ముడివేయమంటావా
నీకు కన్నెముసుగు కప్పమంటావా ?
సాగరమునే సంధింపమంటావా
నీ స్నానపుగదిగా చేయించమంటావా ? ॥నీ॥
కన్నెత్తి నను చూడరాదా
మిన్నుకు రాణిగ నిను చేసుకుంటా

# దేవుడికై -

దేవుడిలోనుంచి వచ్చాను
దేవుడిలోనే చేరుతాను
దేవుడికై జీవిస్తాను
దేవుడు ద్వారానే జీవించ గలిగినట్లు
దేవుడి కొరకు జీవించగలను -

అంతా దేవుడి గూర్చే - వినిపిస్తుంది
అంతా దేవుడి దగ్గరకే - నడిపిస్తుంది
దేవుడికై జీవించని జీవితం కాజాలదు నిజమైన జీవితం.
ప్రతిక్షణం దేవుడికై ఆడనిగుండె ఉండీ ఉండనట్లే
ఓ దేవుడా ! నా స్వరం నీకే అర్పించనీ
నా కవిత నీకే అంకితం చేయనీ
నీకై జీవించనీ
నీచే సృష్టించబడి
నిన్ను ప్రేమించుటే
నా జీవిత పరమావధి.

# అక్షరాలు

అక్షరాలు అరుస్తున్నాయి
వాక్యాలు కేకలు వేస్తున్నాయి
పుస్తకపు పుటల్లోనుండి -
తమను రక్షించమని -
తమను సరిగా వాడుకుంటే
మానవాళి మరింత వికసిస్తుందనీ ||అక్ష||

భాషే నాగరికతకు పునాది అనీ
మాటే మనిషికి మాణిక్య కిరీటమనీ
అదే అతడిని జంతువునుండి వేరుజేస్తుందనీ
పుస్తకం హెచ్చరిస్తుంది
అక్షరం తక్షణం కళ్లు తెరవమంటుంది
వాక్యం మనసు విప్పి పలుకమంటుంది ||అక్ష||

తమను బందీనుండి విడిపించమనీ
బానిస బ్రతుకు భరించలేమనీ
స్వేచ్ఛా జీవితంలో
ప్రజాసేవ చేయగలమనీ ||అక్ష||

# కాలాన్ని ఉపయోగించు

మానవ జన్మ మరపురానిది
మళ్లీ కావాలన్నా దొరకనిది.
ఇతరులకు మంచి చేయాలంటే
ఇదే మంచి తరుణం
పరులకు దయ చూపాలంటే
లేదు ఇంతకు మించిన అవకాశం.
అందుకే పూనుకోవాలి మానవ సేవకు నేడే
వేయరాదు వాయిదా రేపటికి
మళ్లీ ఈ జీవిత మార్గాన వెళ్ళలేం గనక
కాలం గడువక ముందే
నడుం కట్టి నడవాలి ప్రజాసేవ పథంలో.

# ఏది మేలు

ప్రేమ పన్నీరు చిలకని
ప్రియ భోజనమైనా కాదా విషం ?

గానాన్ని ప్రేమించని
కిన్నెర పాటైనా కాదా చెవిలో రొద ?

శ్రద్ధలేని పని చేయడం కంటే
కాదా భిక్షమెత్తుకోవడం మేలు ?

# అందమే దేవుడు

అందమే దేవుడు
ఆనందమే సత్యము.
అందానికి కాపించు తపం
ఆనందాన్ని పూజించు
అందం కాదు శరీర సౌష్టవం
అందం హృదయంలో వెలుగు.
ఆత్మను ఆకర్షిస్తుంది అందం
సుఖదుఃఖాల ఔన్నత్యమే ఆనందం
అందమే మన మతము
అందమే మన దేవత.
కంటికి కనిపించే దేవుడి సృష్టి అందం ఒక్కటే
దాని ఫలితమే ఆనందం
అందం అవసరం అందరికీ
అదే ఆనంద స్పందనం.
పొంగే హృదయం అందం
పరవశమయ్యే ఆత్మే ఆనందం
కళ్ళు మూసినా కనుపించే రూపే అందం!
చెవులు మూసినా వినిపించే స్వరమే ఆనందం!

# చూడమన్నా నా

ఆమె: క్రీగంటి చూపులతో నిను చూడ మన్నానా
ప్రేమ ఆటలు నే నాడ మన్నానా

నిన్నడిగానా
నే కోరానా

అతడు: మల్లె మొగ్గలా నీ బుగ్గలు పుయ్యమన్నానా
మంచి గంధంలా సిగ్గులు వెదజల్లమన్నానా

నిన్నడిగానా
నే కోరానా

ఆమె: (సి) మగసిరి నంతా తెగ చూపమన్నానా
(ఈ) పగలే నాతో సరసాలాడ మన్నానా

నిన్నడిగానా
నే కోరానా

అతడు: నవ్వుల పువ్వుల మాలలు వేయ మన్నానా
కైవ్వన నను కవ్వించ మన్నానా

నిన్నడిగానా
నే కోరానా

ఆమె: అరమర ఎరుగని నా ఎదను దోచుకో మన్నానా
మరి మరి దానిని గుండెల్లో దాచుకో మన్నానా

ఇద్దరు: నిను చూడ మన్నానా
నే నాడ మన్నానా

# నవయువకుల్లారా

నవయువకుల్లారా
నోటి మాటలు కట్టిపెట్టాలి
సాటి వారికి సాయపడాలి
అదే, అదే మనలక్ష్యం – మన ధ్యేయం ॥నవ॥
మనమంతా యువకులం
మనకెంతో ఉత్సాహం
మానవ సేవే మాధవసేవని
మనమిక లోకానికి చాటిస్తాం ॥నవ॥
మనలో వరదలు పొంగే భావ తరంగిణి
మనల్లో ఉరకలు వేసే పడుచుదనం
సమాజ వికాసానికి ఉపయోగించాలి
సామ్యవాదం గెలిపించాలి ॥నవ॥
సంగీతానికి మెరుగులు దిద్ది
సాహిత్యానికి విలువలు పెంచి
సంఘసేవనెంతో మనం సాధించాలి
మమతలు మనుష్యుల్లో పెంచేద్దాం
వారి మనసుల్లో
మారుపు తెచ్చేద్దాం ! ॥నవ॥

# ఎవరు నేను?

తీరని కోర్కెల మూటను నేను
అవకాశాలను అందుకోలేని తీగను నేను
అతకని అంకెల గొలుసును నేను
పిల్లగాలికి మెల్లగా ఊగే తరువును నేను

వేళ్లు పాతుకోని మొక్కను నేను
రంగులు మొలవని మొగ్గను నేను
వాసన పొందని పువ్వును నేను
చుక్కలు లేని శూన్య ఆకాశం నేను
చంద్రుడు లేని రోదసి నేను
రాగం లేని పాటను నేను
లయ విన్యాసం లేని నృత్యం నేను!
సతమత మౌతున్న
సమాజంలో బొమ్మను నేను
గమ్యం కానని సామాన్యుని నేను!

రెక్కలు విప్పని పక్షి కూనను నేను
రెప్పలు తెరవని పశికందుని నేను
పాలు మరువని లేగ దూడను నేను
గిచ్చితే పాలుకారే కిశోరం నేను
మాటలు రాని శిశువును నేను
ఆటలు తెలియని పసిడి మూటను నేను.

# వెన్నెల్లో ప్రయాణం

వెన్నెల్లో ప్రయాణిస్తున్నాను
చకోర పక్షిలా విహరిస్తున్నాను
కలవల జంటలు కనిపిస్తున్నాయి
పలు విధాల కవితలు
కలం పాళీలో దుముకుతున్నాయి.
సమాజ వికాసం
ప్రజా జీవితం
కల అద్దంలో కనిపిస్తున్నాయి.
రవినో కవినో కాని
అద్దంలో బొమ్మలా
అన్నీ చూపించాలని అనిపిస్తుంది
కవిత సామాన్యుడికి పనికి రాకుంటే
చెవిటికి శంఖంలా
అడవిన గాచిన వెన్నెల్లా
బూడిదలో పన్నీరులా
కాదా వృథా వికసించని పుష్పం?

# రామాయణ సారం

రామ రావణ యుద్ధమట
రాణింపు గాధ యట

కొడుకును అడవికి పంపెనట
అతడే గొప్ప తండ్రియట —

మాటకు బదులు చెప్పక తలయొగ్గెనట
అతడే మహా గొప్ప పుత్రుడట —

పరసతిని కొనిపోయెనట
అతడే మహా శివ భక్తుడట —

మాయతో వాలిని గూల్చెనట
అతడే మహా యోధుడట —

అన్నకు ద్రోహం చేసేనట
అతడే గొప్ప దేశ భక్తుడట -

చాకలి ఏదో గొణిగెనట
సతి సీతను కారడవులపాలు జేసెనట
అతడే గొప్ప మారాజట!

# అంతా నీవే

శాంతికి రూపం నీవే
కాంతికి దీపం నీవే

నెమలి నడకలో నృత్యం నీవా
హంస నడకలో అందం నీవా

చిలుక పలుకులో మధురం నీవే
కోకిల కంఠంలో గానం నీవే

కోడె తాచు విప్పిన పడగవు నీవా
వాడి కోరల సింహం నీవా

మలయ మారుతం చలువవు నీవే
మంచి మల్లెల పరిమళం నీవే

ఎగిరే పక్షి వేగం నీవు
రగిలే నిప్పులో వేడివి నీవు

నేలకు నింగికి నిచ్చెన నీవా
గిరులకు తరులకు పచ్చదనం నీవా

శ్రమకు ఫలితం నీవే
కాల గమనపు కొలతవు నీవే

నిన్నటి చావు నేటి జీవితం రేపటి పుట్టుక నీవేకాదా
అంతా నీవేకాదా నీవే నీవే.

# రాధను నేను

రాధను నేను – మరి మరి పిలిచేను
మాధవ రావేలా ?
మోదము గూర్పగ
వేణువు నూదవదేలా ? ||రాధ||

బృందావనిలో
అందాలొలికించే
గోప కాంతపై కోపమదేలా ? ||రాధ||

రేపల్లె మాపల్లె కాదా
రేపు మాపులు కాచియున్న
దాపు రావదేలా గోపాలా ? ||రాధ||

మధురా నగరిలో
మల్లె మొల్లల మాలలతో
(నీ) పూజకై నిలచి ఉన్నారా
నన్నేలుకో వేమయ్యా మదన గోపాలా ? ||రాధ||

ఆల మందలగాచి అలసినావా ?
పాలు వెన్నలు గ్రోలి సొలసినావా ?
కరుణింప రావయ్యా నంద గోపాలా !
కాపాడ రావయ్యా బాలగోపాలా ||రాధ||

# కాలప్రవాహం

అనుక్షణం అడుగు జారి పోతున్నా
"ఈ క్షణమే" నీవు నిలుచుండే మెట్టు -
"నిన్న" కలిసిపోయింది
కాల ప్రవాహంలో
"రేపు" వచ్చునో, రాదో
వచ్చినా క్షణంలో చేయి జారి
అనేక "నిన్న"ల్లో అణువుగా కలిసిపోయే రేణువు.

# కన్నులు అద్దెకు ఇస్తే

మోకాళ్ళలో మెదడుంటే
తల పని చేసేదెలా ?
వీపున మోకాళ్లుంటే
మరి ఇక నడిచేదెలా ?
కన్నులు అద్దెకు ఇచ్చుకొని
చెవులకు చూపులప్ప చెపితే
నిజము తెలుసుకోవడం ఎలా ?
నాలుక పారవేసుకొని
పెదిమలకు పెత్తనమప్ప చెప్పితే
మాటకు విలువేది ?
నిముషాని కొక బుద్ధి
పుర్రెకు పుట్టుతుంటే
పుణ్యకాలం కాస్త
ఆలోచనల్లోనే గడిచిపోదా ?
పూనిన కార్యం నెరవేరేదెలా ?
అనుకున్న పని అయ్యేదెలా అదెలా ఎలా ?
అందరినీ మెప్పించడమే ఆశయమైతే
ఎవరినీ నొప్పించరాదనే సూత్రం ఉంటే
పరిపాలన సాగేదెలా
సంసారం చక్కబడేదెలా

అధికారం అంతా స్వంతానికే అయితే
అవకాశాలన్నీ బంధుమిత్రులకే అంకితం అయితే
పేదల బ్రతుకుల శ్రమిదలు పెరిగేదెలా ?
బీదల కడుపులు నిండేదెలా ?

ఎలా! ఎలా!!

కన్నులు తలపై మొలిచితే
మిన్నే నేలగ కనిపిస్తే
న్యాయం చేకూరే దెలా
అన్యాయం అరికట్టేదెలా
భాషకు దాసులమైతే
కుల మత వైషమ్యాలకు కూకటివేళ్ళం మనమైతే
(మన) దేశం గతి ఏమి ?
(ఇక) మాతృ భూమి మాటేమి ?

# అతి మధురం

అతి మధురం అతి మధురం
చెలి అధరం అతి మధురం
నెచ్చెలి కౌగిలి అతి మధురం
ప్రియ మిత్రుల సంభాషణ అతి మధురం
సత్పురుషుల స్నేహం అతి మధురం
పసిపాపల పలుకులు అతి మధురం
ముసి ముసి నవ్వుల తళుకులు అతి మధురం
పున్నమి వెన్నెల అతి మధురం
పువ్వుల పరిమళ మతిమధురం
తరుణి పలుకుల చెణుకులు అతి మధురం
కరుణాత్ముని హృదయం అతి మధురం
యువతలో మత్తుదనం అతి మధురం
నవతలో కొత్త దనం అతి మధురం
వయసులో వగరుదనం అతి మధురం
సొగసులో సౌందర్యం అతి మధురం
పరువంలో పొగరుతనం అతి మధురం
పడుచుతనంలో గడుసుతనం అతి మధురం
మధురాతి మధురం
మనసులో మమకారం అతి మధురం, అతి మధురం.

# కాలంకుంచె

భవిష్యత్తు నూతి లోతులో చూశాను
మెరుస్తున్నాయి వెలుతురు బాణాలు
ఆకాశం కాషాయ మంటల్లో రగిలిపోతుంది
ఆశల గోళాలు వినువీధుల్లో విహరిస్తున్నాయి
ఆకాశపు నీడలో అంతరిక్ష నౌకలు విహరిస్తున్నాయి

తీరపు ఇసుకపై
వ్రాశాను బాధల గాధలు
అలల వెల్లువలు
హత్తుకున్నాయి వాటిని హృదయానికి
కడిగివేశాయి నాలోని కల్మషాన్ని
వాయుదేవుడు తరిమివేశాడు మేఘాలను
కెరటాలు తహతహలాడుతున్నాయి తీరాన్ని అందుకోడానికి

తూరుపు నింగి ఉషస్సు రంగు పులుముకుంది
ఆలోచనలు అలలపై స్వారి చేస్తున్నాయి
ఆచరణ యిసుక తిన్నెలపై
మలయ మారుతంలా విహరిస్తున్నాయి
కాలంకుంచె కధలను మరుగుపరుస్తుంది.

# ప్రతి...... ప్రతి

ప్రతి మరియమ్మకు పుట్టదు క్రీస్తు
ప్రతి పుష్పం వెదజల్లదు పరిమళం
ప్రతి వృక్షం కాయదు తియ్యని ఫలాలను
ప్రతి సెలయేరు ఆలపించదు సరిగమల స్మృతి.

# వయసు - వలపు

వయసులో ఉంది అందం
వలపులో ఉంది ఆనందం
వయసు కాదు దూరం
వలపు కాదు నేరం
వయసు ముదిరితే
కారాదు విషాదం
వలపు చిలికితే
కారాదు విచిత్రం.

# కలం - గళం

కరం తొక్కుతుంటే కలం
పదం పాడుతుంటే గళం
కాదా కవిత్వం సంగీతం
రాదా సంగీతానికి సాధనం
పొందలేడా కవి అమరత్వం

# స్వార్థం-పరమార్థం

స్వార్థం పరమార్థం ఎందరికో
పేదల బాధలు తీర్చడంలో
ఉంద పరమార్థం మరికొందరికి
స్వార్థానికి మూలం కోరికలు
పరమార్థానికి త్యాగం అర్థం.

# నగరం - నరులు

నవ ఢిల్లీ నవ్వుతూ పిలిచింది
విమానం దిగి టాక్సీ ఎక్కగానే —
ఉద్యోగ భవనంలో ఉద్యోగులు నిద్ర మత్తులో
ముందున్న నిరుద్యోగుల 'క్యూ' గొడవ పట్టించుకోనే లేదు
కృషీ భవనంలో 'కృషిం నాస్తి దుర్భిక్షం' అన్న
బోర్డు మాత్రమే మిగిలింది

భిక్షానికైనా కృషి కాన్పించదు -
రాజపాత్‌లో నడిచేది భిక్షగాళ్లు
మురికి గొందుల్లో మెలిగేది లక్షాధికార్లు
వాళ్ళకాళ్ళ వేగం
వీళ్ళ కార్ల వేగంతో పోటీ పడగలదా ?
మేడలు వినువీధులంటుతుంటే
మెడలు విరిగిపోతున్నాయి
ధరలు ఆకాశంలో విహరిస్తుంటే
నరులు అవకాశాలకు వేచి ఉన్నారు!
మధుర మధుర పానశాలల్లో
వగలమారి వయ్యారుల సయ్యాటలతో
కోటీశ్వరులు విలాసాలు గడుపుతుంటే
కడుపు చేతపట్టుకొని పూట కూటికై
కోట్లు కొట్టుకు చస్తున్నారు

నల్లధనం బొక్కసంలో మూలుగుతుంటే
తెల్ల మీసాలకు నల్ల రంగు తగిలిస్తున్నాడు
ఓ సంఘాన్ని మింగే తిమింగలం -

తెల్లవారితే పిడికెడు మెతుకులకై
హోటళ్ళ కసువు కుండీ మెతుకులకై సోదా చేస్తున్నాడు
నల్ల వెంట్రుకలుండీ దువ్వుకోలేని ఓ నిర్భాగ్య సోదరుడు

# నేటి సమాజం

నేటి సమాజం
భలే వింత - నిజం॥
నీటిలో నివాసం
గాలిలో ప్రయాణం॥
నేల మీద మనిషి నిలువలేడు - ఇది నిజం
గాలిలో ఎగురుతాడు
నీళ్ళలో తేలుతాడు
నేలమీద ఇక నిలువలేడు మనిషి - ఇది నిజం॥

నిప్పమీద నడుసాడు
తప్పులెన్నో కప్పుతాడు
పాపాలెన్నో చేస్తాడు
పరిహారం మొక్కుబడి చెల్లిస్తాడు ॥నేటి॥

దేవుడంటే భయం లేదు
దెయ్యమంటే వులికి పడతాడు॥
ఆపదొస్తే దేవుడంటాడు
ఆ తర్వాత అతడొక పనికిరాని రాతిబొమ్మ!

లోకానికి మేలు చేసిచూడు
మనిషి నిన్ను వెంటనే మరువకుంటే చూడు
మంచిగా మసులుకో నువ్వు
మనిషి నిన్ను మళ్ళీ చూస్తేఒట్టు॥
తిట్టు, కొట్టు, తిప్పలెన్నో పెట్టి చూడు
ప్రతి దినము నీకు పూజ చెయ్యకుంటేఒట్టు ॥నేటి॥

# హతం - ఖతం

ఏదో పండుగ జరిగింది
ఒక రకం వాయిద్యాలు వద్దన్నారు
ఒక తెగ వారు
ఉండి తీరాలన్నారు
మరో తెగవారు.

ఇరుతెగలకు చెందిన ఇద్దరు మిత్రులు
కట్టుకున్నారు ఇనుప గోడలు హృదయాల మధ్య
తేనె మనసులో విషం చిలికింది
పాల ప్రవాహాన్ని ఉక్కుగోడ అడ్డగించింది
మనుషుల హృదయాల్లో
కరుణా క్షీరం కరడు కట్టింది.

రక్త ప్రవాహం పరులై పారింది
కాకులకూ, గద్దలకూ విందులు చేస్తూ -

గురిలేని కాల్పులకు
అర్థంలేని పరుగుళ్ళకు
ఆహుతి అయినారు
అమాయక ప్రజలు

అర్థమేమిటి దీనికి -
"ఆ మతంలో ఒకడు హతం
ఈ మతంలో ఒకడు ఖతం"
అని తప్ప ?

# పాపం - పుణ్యం

అది పాపమా
పాపం ! ఇది పుణ్యమా !
పాప పుణ్యాల 'అర్థం' ?
పాపుల బ్రోచే
ఆపైవాడే చెప్పాలి !
పాపకూపంలో నడవ వద్దని
పశ్చాత్తాపం చెందాలని
పలు పలు విధాల
బోధలు చేస్తారు
పాపం ! వాళ్ళకు
"పాపం" అంటే తెలిస్తేనా !
పుణ్యం అంటే
బుర్ర కెక్కితేగా !
పాపం పుణ్యం కలయిక లేకుంటే
చీకటి వెలుగుల కలయికల
లోకం గడిచేదెలా ?
దేవుడి సృష్టికి రూపం ఏది ?
'పాపం' అనే వాళ్లు
పాఠం చెప్పేదెలా ?
ఎలా ఎలా ఎలా ?

# మాటలు - మనసులు

మాటలు కోటలు దాటితే
మనసులు కలిసేనా
మన్మథు డొచ్చేనా
మనుషుల మనసులు కలిపేనా ?

తలపుల మొగ్గలు విచ్చేనా
వలపుల వర్షం కురిసేనా
మరి లేక - మలయ మారుతం
ప్రళయంగా మారేనా
మల్లె పువ్వులు ముళ్ళకంపగా మారేనా ?

# మాధుర్యం - కాఠిన్యం

ఓ జీవితమా
నీవు ఎంత మాధుర్యం !
కవి హృదయం లా
దయా కరుణా రసాలతో
నిండి ఉంటావు.

ఆహా జీవితం
ఎంత కాఠిన్యం
అది నేరస్తుడి
గుండె లాంటిది
భయం అపకారాలతో
దడ దడ కొట్టుకొంటుంది !

ఓ మనిషీ గుండె విప్పి చూసుకో
నీకు నీవు జవాబు చెప్పుకో
జీవితం - కవి హృదయంలాంటిదా !
నేరస్తుడి గుండెలాంటిదా ?

# అనిపించింది

విమాన యానం చేస్తూ
కిందకు చూ స్తే - అనిపిస్తుంది
వంకర టింకరగా
కనిపించే వృక్షాలు
మనిషి పెంచినవా ?
లేక - తుంచగా మిగిలినవా? అని.
కనిపించే రహదారులు
మనిషి వేసినవా
లేక - అతడు పాడుచేసినవా - అని.

# నేటినే సేవించు

ఈ రోజునే కోరుకో
నేటినే ఎన్నుకో
అదే జీవితం గనుక
అదే ప్రాణం గనుక
దాని సంక్షిప్త మార్గంలో
నీ ఉనికి నడుస్తుంది గనుక -
అదే నీ అభివృద్ధి పథం
నీ చర్యల కీర్తి
నీ అందాల ప్రజ్వలం.
కారణం - నిన్న ఒక స్వప్నం
రేపు ఒక ఆశ
కానీ నేడు సరిగా జీవిస్తే
నిన్న ఒక సంతోషదాయక స్వప్నం అవుతుంది.
ప్రతి రేపు ఆశకు మూలం అవుతుంది
కాబట్టి నేటినే సేవించు
ఉషస్సుకే నమస్కరించు

( మూలం - మహాకవి కాళిదాసు )

# అడ్డు గోడలు

జీవితంలో
చావు, వనులు, విమర్శ
తప్పనివి -

విమర్శ అనేక రకాలు
హేతువాద పూరితం
అర్థంలేని ఆక్రోశం -
అందుకు జవాబు
అనుభూతి మూలం

చెందరాదు అనాసక్తి
పొందరాదు క్రోధం
విరోధులకై ప్రార్థించాలి.

శత్రువులున్న వాళ్ళు
విమర్శను పొందిన వాళ్ళే
అవుతారు గొప్పవాళ్ళు!

విమర్శను విశదంగా పరిశీలించాలి
ఆలోచించాలి అందులోని అంశాలను
నేర్చుకోవాలి పాఠం
విమర్శ వల్ల.

మంచి మాటలు మనలను
సంతోష పరుస్తాయి
కానీ ఆలోచనలకూ
అభివృద్ధికి
అడ్డు గోడలుగా నిలుస్తాయి!

# కవి-అక్షరం

అక్షరం: కవీ! నన్ను నీ కలంతో కట్టి బంధించేశావు!

కవి: అక్షరమా నీ పేరే అమరం

నీవు లేందే

లేదు పదం, లేదు జగం

మాట కోసం హరిశ్చంద్రుడు

భార్యను దాసిగా అమ్మాడు.

పేరు కోసం రామచంద్రుడు

సీతా మాతను అడవులపాలు చేశాడు.

అక్షరమా నువు చింతించకు

అంతా మనుషుల తప్పే!

కలం పాళీ బాణంతో

గుచ్చుతున్నా నీ గుండెల్లో

బాధ చెందకు క్షణమైనా

కాలం ఇక్కడ, కవి ఎక్కడో కాకుండా

పదంతో గళం కలిపి

కలంతో కదం తొక్కేలా

అక్షరమా సమకూర్చు

సరిగమల తోరణాల సమాధానం

ప్రజా శ్రేయస్సుకాధారం.

# అత్తలు కోడళ్ళు

అత్తలకు కావాలి కోడళ్లు
అయినా అత్తలే చేయాలి పెత్తనం!
కొడుకుల మీద ప్రేమ
కోడళ్ళ మీద లేకపోవడానికి
చేయాలి పరిశోధన శాస్త్రవేత్తలు.

అల్లుళ్ళపై ఆదరణ
కూతుళ్ళపై మమకారం
కోడళ్ళపై లేకపోవడం
ఆశ్చర్యాలలో ఆశ్చర్యం!

అత్తల దృష్టిలో కోడళ్ళు కొంటెవాళ్ళైనా
మనుమళ్లు మహానుభావులే!

# అన్నీ అద్దెకే!

నేటి ప్రపంచంలో
అన్నీ అద్దెకే!
చివరకు పెళ్ళి, పెళ్ళాం, పిల్లలు
అద్దెకు కావాలంటే
అలుసుగా దొరికే రోజు లొచ్చాయి !
ఇక ఇల్లు, కుర్చీలు, కాఫీ కప్పులు
రేడియోలు, మంచాలు, కంచాలు
కార్లు అన్నీ అద్దె జీవితాలే!
ఇక అద్దె నీళ్ళు
అద్దె (చద్ది) అన్నం
అంతా అద్దె జీవితం
ఇక ఎంతో దూరాన లేవు.

# మనిషి గమ్యం

మేఘాలు గొడుగు విప్పి ఉరిమాయి
ఈదర గాలి భోరుమని పద్ధులతో వీచింది
వర్షం దుస్తులు విప్పి కురిసింది
అడవి తడిసి అలసి తలుపులు మూసుకుంది
ఆకాశం అంతా చుక్కల పూలు విరబూసాయి
జాబిలి తెల్లని విభూతి పండులా వెలిసింది
జీవిత గమ్యాన్ని మరిచి నడుస్తున్నాడు మనిషి
మంచిని విడనాడిన మనిషి జీవితం
మసక చీకటిగా మారింది.

# వగరు - పొగరు

ముసలితం ముంచుకొచ్చినా
చిగురిస్తాయి కొంగొత్త కోరికలు
కోరలూడినా కోడెనాగు బుస కొట్టినట్లు
రేకెత్తుతాయి ఆశలు!
చింత ఎండినా పులుపు చావనట్లు
ఆనందించాలనుకుంటారు అన్నీ
అందని పళ్ళకు అర్రులు చాస్తూ -
చిక్కకుంటే చప్పరిస్తారు
అందని ద్రాక్ష పులుపులా
వయసుకు మనసుకు
వదలరాని సంబంధం -
వర్ణించరాని అనుబంధం
కాయం పండినా
జీవం ఎండునా ?
ఏళ్లు నిండితే - పళ్లు రాలును
కాళ్లు వణుకును గాని -
వగరు తగ్గునా - పొగరు చచ్చునా?

# మగవారిలా-

మగవారిలా మగువలెందుకు మసలుకోరో
తోటి అందమైన పడతిని చూస్తే అసూయలెందుకో
చీరలంటే మోజులెందుకో
బట్టలంటే మక్కువెందుకో
నగలంటే - వగలెన్నో ఎందుకెందుకో -!

ఊరివారందరి ఊసులెందుకో
పక్కఇంటి పాపమ్మ ఆపసోపాలు ఈపెకెందుకో!
అవతలింటి ఆండాళమ్మ
ప్రేమ కలాపాలు ఈవిడకెందుకో
పొరుగింటి పుల్లమ్మ
విడాకుల సందడి ఈమెకెందుకో

మగవారిలా మగువ
లెందుకు మసలుకో లేరో!

# ఏది సంతోషం

పుడమిన పుట్టిందెందుకు
జగతిని వెలసిందెందుకు -
పుట్టినవారు గిట్టుటకేనా
ఎట్టకేలకు సాధించేదేది
మట్టిలో కలిసి పోవుటే
మనిషికి లక్ష్యమా!
వట్టి చేతులతో భూమిన చేరి
పట్టుక పోయేదేమి-ఆర్జన ఎంతైనా
ఉన్న పదిరోజులలో
కొన్ని దినలైనా
మంచిగా బతికి, మనిషిని ఎరిగి
కొంచెం జగతికి మేలుచేస్తే
కాదా లోకం సుఖదాయం
లేదా మనసుకు సంతోషం.

# అలసట - వేసట

అలలకు లేదు అలసట
కలలకు లేదు వేసట

అలలు కన్నాయా కలలు
కలలు విన్నాయా అలలు
అయినా కవి పోల్చాడు
అలలను కలలతో—
వినిపిస్తుంది అలల ఆలాపన
కనిపిస్తుంది కలల అనుభూతి
కవి కన్ను తెరిస్తే-

అలలకు లేని అలసట
కలలకు లేని వేసట
ఇలలో మనిషికెందుకో!

అలలో ఊగుతూ
కలలో తూగుతూ ఉంటే
అలలో ఆడుతూ ఉంటే
కలలో పాడుతూ ఉంటే
అలలో లేని అందాన్ని
కలలో లేని ఆనందాన్ని
ఇలలో పొందడం
మనిషికి మహదానందం
లోకానికే పరమానందం

అలలో తేలియాడుతాం
కలలో కదిలి తేలుతాం
అలల్లోని కల్లోలం
కలల్లోని ఉల్లాసం
కాదా మనిషికి ఉత్తేజం
వేసట ఉంటుందా నిత్యం
అలలా, కలలా - ఏది సత్యం!

# ఎన్నడు - ఇంకెన్నడు

పేదల బాధలు తీరేదెన్నడు
వారి కన్నీటి ధారలు ఆరేదెన్నడు
ఎన్నడు - ఇంకెన్నడు—

సమాజంలో సమానత్వం నెలకొనేదెన్నడు
అందరు కలసి తిరిగేదెన్నడో

ఉన్న వారికి ఊడిగం
లేనివారు చేసే రోజులు ఆగేదెన్నడో
జాతి పుష్పమాలలో
కులమత భేదాల ముడులు సడలేదెన్నడో
అగ్రజులని పంచములని తేడా తెరలు
తొలగేదెన్నడో, ఎన్నడో, ఇంకెన్నడో
మనుషుల మనసులుమారేదెన్నడో
మనిషిని మనిషిగ చూసే దెన్నడో, ఎన్నడో, ఇంకెన్నడో
ప్రకృతి సంపద ప్రజలకు అందేదెన్నడో
ఉన్నవారు లేనివారు అన్నదమ్ముల్లా ఉండేదెన్నడో
ఎన్నడో, ఇంకెన్నడో
మనసు మనసు కలిసే దెన్నడో ఇంకెన్నడో

మనిషిని మనిషిగ చూసే దెన్నడో
ఎన్నడో, ఇం కెన్నడో
ఈర్ష్య, అసూయలు తరిగే దెన్నడో
ప్రేమ, కరుణ పెరిగే దెన్నడో
ఎన్నడో, ఇం కెన్నడో!

# అన్నిట నేనే!

చతుర్వేదములందు సామవేదము నేనే
పదునొకండ్రగు రుద్రులందున శంకరుడను నేనె
వివిధ సేనాపతులయందు కుమారస్వామి నేనె
ఋషి గణంబుల భృగువు నేను
గంధర్వ జాతిలో చిత్రరథుడ నేను
గోవులందు కామధేనువు నేను
నాగులందున శేషనాగు నేను
జలమునందున వరుణరూపు నేను
నదులయందున యమునను నేనె
సర్వమును హరియించు మృత్యువు నేనే
నేను కీర్తిని
శ్రీని నేనే
వాణి నేనే
వంచకుల జూదంబు నేను
మంచి వారల మనసు నేను
వీర్యవంతుల వీర్యరూపము
విషయ శీలుర విజయ గర్వము
యాదవులలో వాసుదేవుడ
పాండవులలో అర్జునుండను నేనె

దమనశక్తిని, రాజనీతిని
ఇంతయేల లోకమందున శక్తియుక్తము
కాంతి యుక్తము
ధ్యాన యుక్తము నేనే పార్థా!
సకల విశ్వము నాదు అంశమె
తెలుసుకో కుంతితనయ

# దోబూచులు

కదలని సూర్యుడు
కైవారం చేస్తున్నాడని
నమ్మిన రోజులున్నాయి—
కదలేది మనమున్న భూమి అని
కష్టంతో నమ్ముతున్నాం నేడు.

గోళాల మేళవింపు
దాగుడు మూతల ఆటల్లో
భూమికి సూర్యుడికి మధ్య
చంద్రుడు అడ్డురాగా
సూర్యుడు ఆడుతాడు
దోబూచులు భూమితో—
దాగుతాడు చంద్రుడి వెనుక—
పడుతుంది గ్రహణం

అనుకుండేవాళ్లు ఒకనాడు
సూర్యచంద్రులను రాహుకేతువులనే
గండు కొండచిలువలు మింగేవనీ—

విజ్ఞానశాస్త్రం విపులంగా
వివరించి చెబుతోంది నిజాన్ని ఈనాడు
అది నమ్మదగిన సత్యం—

తప్పక చూడదగిన దృశ్యం—
చూస్తే కన్నులకు వలసిన అద్దాలు ధరించి—
లేకుంటే పోతుంది చూపు
గుడ్డి జీవితం అవుతుంది ఇక రేపు—

# నేర్చుకో

చిరునవ్వులు చిలకరించి
కమ్మని సువాసనలు వెదజల్లడం
పువ్వుల నుండి నేర్చుకో!

సంతోషంతో
సహకరించి కృషించడం
తేనెటీగల నుంచి నేర్చుకో!

ఫలాలను, నీడను యివ్వడం
చెట్లనుంచి నేర్చుకో!

ఉనికి లేములు
కుల మత భాషా విభేదాలు పాటించక
వేడి వెలుగుల నివ్వడం
సూర్యుడి నుండి నేర్చుకో!

తన కష్టాలను పాటింపక
చల్లని దివ్యకాంతి నివ్వడం
చంద్రుడి నుండి నేర్చుకో!

ఆటంకాలను కష్టాలను ఎదుర్కొని
గమ్యం వైపు పురోగమించడం
నది నుండి నేర్చుకో!

కష్టాలను ఓర్చుకొని
మంచి రోజులకై ఎదురు చూడడం
వేసవి చెట్లనుండి నేర్చుకో!

ఇతరులకు వెలుగు నిస్తూ
ఆత్మ త్యాగం చేయడం
దీపం నుండి నేర్చుకో!

# ఆకాశ కన్య

ఆకాశ కన్య అందాల భరిణ
లోకాల మురిపించే
చీకటి కోకలు కట్టుకొని
మనక మేలిముసుగు వేసుకొని
మబ్బు దుప్పటి కప్పుకొని
వెలుగు పువ్వులు ముడుచుకొని
అరుణ కిరణాలు తురుముకొని
మేఘమాలిక మెడలో వేసికొని
మెరుపు పరికిణీలు
మేఘం పమిట కొంగుగా
చినుకుల అత్తరు పూసుకొని
చుక్కల హారం వేసుకుని
జాబిలి పతకంగా
సాగరమే అద్దంగా
కొండలు దిండులుగా
భూదేవి పడకగా
చిందులు తొక్కుతుంది
అందాల ఆకాశకన్య

# అక్షరాలు - మాటలు

అక్షరాలు చేస్తుంటే నృత్యం

మాటలు పాడుతుంటే పాటలు

కవి కలం తొక్కుతుంటే కదం

గళం సవరిస్తుంటే స్వరం

హృదయం మీటుతుంటే వీణ

కరాలు వేస్తుంటే తాళం

మనసు కురుస్తుంటే అమృతం

మెదడు వేస్తుంటే విశ్వకళ్యాణ ప్రణాళిక

కన్నులు తిలకిస్తుంటే ఎనలేని సౌందర్యాలు

నాసిక ఆస్వాదిస్తుంటే స్వేచ్ఛా వాయువులను

కవి కలసి ఈదగలడు

కవితా ప్రవాహంలో

కాగలడు కాలమాలకు ముత్యంగా

కాలానికి కాగడాగా

జీవించగలడు జగతిలో ప్రాణిగా—

# ఓ మనిషి!

ఓ మనిషీ ముందు చూపుతో నడవాలి
వెనుక ముందులు గమనించాలి
ముందు నడిచే ముసలివాడిని
వెనుక వచ్చే కుర్రవాడిని
మధ్య నడిచే ఓ పెద్దమనిషీ!
గమనించి నడిచితే మంచిదోయి ॥ఓ మనిషీ॥

ముందు నడిచే వాడి బాట చూచి
ఎగుడు దిగుడులు తెలుసుకొని
రాళ్లురప్పలు తీసివేసి
వెనుక నడిచేవాడికి నీవు దారిజూపు ॥ఓ మనిషీ॥

నిన్ను నువ్వే చూచుకుంటే
వెనుక ముందులు తెలియలేవు
లోతు పాతులు ఎరుగలేవు
దారి తెన్నులు తప్పగలవు
నిముషమైన గడవనేరదు నీ జీవితం ॥ఓ మనిషీ॥

గతం నేర్పిన పాఠం
ముందుకు కావాలి గుణపాఠం
నీవు గడించిన అనుభవం కావాలి
రాబోవు ప్రజలకు ఉపయోగం ॥ఓ మనిషీ॥

మనిషంటే కళేబరం కాదని తెలుసుకో
మనిషి అంటే వేషధారి కాదని నీవు తెలుసుకో
మనసున్న వాడే మనిషని గమనించాలి
మంచి మనసున్న వాడినే
మనిషిగా గుర్తించాలి ||ఓ మనిషీ||

# నల్లదొరలు!

తెల్లదొరలు వెళ్ళారు
నల్లదొరలు ఒచ్చారు
నల్ల సిరాతో
తెల్ల కాగితాలు నింపారు-
అయితే అక్కడనే
ఆగింది అభ్యుదయం!
ఎప్పుడూ ప్రజల విన్నపాలు అల్ల అక్కడనే
ఆఫీసు లెన్నింటినో పెంచారు
ఆఫీసర్లనెందరినో వేశారు
ప్రమోషన్లు ఎందరికో వచ్చాయి.
కాగితాలకు సిరాలకు ఖర్చులు ఎన్నో పెట్టారు
కలాలు వ్రాస్తూనేఉంటాయి తీరిక లేకుండా
కాగితాలు పొదుగుతునే ఉంటాయి
బూజుకంబళి కప్పుకుని ఆఫీసు అల్మారాల్లో
ప్రజల గోడులు పడి ఉంటాయి అలాగే
పేదవాళ్ళ కోరికలు మూలుగుతూ ఉంటాయి
చిరస్థాయిగా!

# మనిషికి బానిస

కోవలం సముద్రతీరపు ఇసుకతిన్నెలు
వర్ణించ నలవిగాని వాటి రమణీయపు తెన్నులు
పెట్టనికోటవలె రాతికొండలు ఒక ప్రక్క
వాటితో చేస్తున్నాయి అలలు ఎడతెగని పోరాటం
గెలుపు ఓటములు తేలడానికి పట్టవచ్చు యుగాలు
ఇప్పటికప్పుడే ఎన్ని యుగాలుగా
జరుగుతూందో ఈ సమరం!
నీటి నోట నురుగులు తప్ప
కనుపించదు మరే ఓటమి
రాళ్లుమాత్రం కొండలు కొండలుగా ఉన్నా
అవుతున్నాయి బండలు పిండి కండలు సడలి
ఆగకులేన్నాయి కడలి ముష్టియుద్ధానికి.
హోరుగాలి సహాయంతో
జోరుగా వెనుకంజ వేసి, ముందుకు లేచి
హనుమంతుని కుప్పిగంతును మించి
ఆపలించి కొండకొండనే కబళించేటట్లు
పొలికేకతో ఢీ కొంటున్నాయి అలసటలేని ఆ అలలు.
అరిగి, పలిగి ఓటమి ముఖం దాచలేని
ఆ రాళ్ళ ముఖాల విలవిలలు
సూర్యోదయానికి వెనుకంజ వేసే చంద్రబింబాన్ని
తెస్తుంది జ్ఞప్తికి.

అయినా పోరాటానికి లేదు అంతు
ఆఖరుకు నీళ్ళదే జయమనీ
రాళ్ళకు తప్పదు ఓటమి అనీ
విశదంగా తెలుస్తుంది ఆలోచిస్తే.

నీటికి దూరంగా ఉన్న గుండ్లు
సాటి రాళ్ళ బాధా వ్యధలను చూస్తూ
చేసేది లేక, తమ అవకాశానికై
ఆకాశంవైపు అర్రులు మోడ్చి కాచుకున్నాయి.

అలాగా ఇసుకతిన్నెలకు అలల పోరలకు
పోరాటం సాగుతోంటే

ఇసుక రవ్వలకు లేదు భయం ఇసుమంతైనా
అదురు బెదురు అసలే కనిపించదు
ఆ అలల మూకల రాపిళ్ళకు
హాయిగా ఆనందించే ఆ ఇసుకను
తమ తాకిడికి నిర్లక్ష్యం చేసే ఆ ధూళిరేణువులను
ఏమీచేయలేక దేబిరి ముఖాలతో
వెళ్లుతున్నాయి అలలు తుర్రున వెనక్కు
అయినా ఓటమి ఒప్పుకోలేక
దూకుతున్నాయి పై పైకి-మళ్లీ నోట్లో
మట్టికొట్టుకొని వెనక్కు వెళ్ళడానికి-

ఈ సమరం రెండు రంగాల్లో ఇలా ఉండగా
మూడవ రంగం చూడాలి ముచ్చటగా
కొండబండలను, ఇసుక తిన్నెలను ఎదిరించే మహాసముద్రం
కాక తప్పిందికాదు బానిస మనిషికి
చేసి కోరింది దాస్యం అతడికి!
ఆరడుగులు మించని విరిగిన పాతకొయ్యతో
అడుగడుగునా అతుకుల చెక్కలతో
అతడు తయారు చేసిన రెండు కూసాల నావపై
పలుతున్నాడు గోచిపాత జాలరి ఆ జలప్రపంచాన్ని
స్వారి చేస్తున్నాడు ఘోషించే ఆ అలల మూపురాలపై
విసురుతున్నాడు వల కసురుతూ
తిప్పుతున్నాడు తెడ్డు బలంతో
పట్టుతున్నాడు చేపలు బెట్టుగా
చేరుతున్నాడు ఒడ్డుకు క్షేమంగా
ప్రకృతినే జయించే సముద్రాన్ని క్షణంలో
ఓడించిన ధీమాతో!

అలనాడు అగస్త్యుడు పట్టాడు ఔపోసన
ఈనాడు మన జాలరి నొక్కి పట్టాడు
సాగరాన్ని తనకాలికింద.

# ఆంధ్ర వ్యాసుడు

ఆనాడు వ్రాశాడు వ్యాసుడు
సంస్కృతంలో పురాణాలు పద్దెనిమిది.
ఈనాడు వ్రాశావు నీవు
తెలుగులో పంధొమ్మిదవ పురాణాన్ని.
వ్యాసుడు వ్రాసిన పురాణాలు
వాస్తవాలో కాదో కాని
నీ ఆంధ్రపురాణం మాత్రం
అక్షరాల వాస్తవం
ఆంధ్రుల కీర్తికి కౌస్తుభం.

పుట్టాడు ఆదికవి నన్నయ
ఇక్కడే రాజమహేంద్రవరంలో
సన్మానించబడ్డాడు
రాజరాజ నరేంద్రరాజుచే
జనించావు నీవు గోదావరి గట్టునే
సన్మానించబడ్డావు
రాజమహేంద్రవర పురజనులచే.

ఆ వ్యాసుడితో పోలిస్తే
నీవే అదృష్టవంతుడవు.

(మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి సన్మానసందర్భంలో)

# ఒకనాటి వ్రాతలు

వ్రాశారు కావ్యాలనేకాలు
గీశారు గీతలు చాలా
అందున్న సారాంశమేమిటి?
ఆడదాని అంగవర్ణన
కాళ్లు చెవులు లేని కట్టుకథలు
వ్రాసిన కథనే తిరిగి వ్రాయడం
"పాడిందే పాడే పాచిపళ్ళ దాసరి" అన్నట్లు.
ఏడ్పులో పాటలు
ప్రణయంలో విషాదం
న్నిట్లో అతిశయోక్తి మిన్న-
అనుభవదూరమైన వ్రాతలు.
ఆ పైగా అన్నీ అనువాదాలు! అనుకరణలు!
అయినా- చేసారు సాహిత్య సేవ
మరచారు మానవకళ్యాణం
చెప్పారు వింతైన కథలు
చూశారా సాటి మానవుని బాధలు?
బోధించారు ఎనలేని నీతులు
పాటించలేని పరమ సూక్తులు.
ఆ మహాకవుల మేటి బుర్రలు
ఆ మహారచయితల కోటి వ్రాతలు
మానవ కళ్యాణానికి వినియోగించి ఉంటే
మన ప్రపంచమెంత మారి ఉండేదో!

# దేవులపల్లి - రాళ్లపల్లి

దేవులపల్లి మీ యింటి పేరు
రాళ్ళపల్లి మా వూరి పేరు
ఊళ్లోవుంటాయి ఇళ్లు, గుళ్లు
ఇళ్ళలో వుంటారు మనుషులు
గుళ్ళల్లో వుంటాయి రాళ్ళ విగ్రహాలు
దేవుళ్ళకు - నిలయం మీ ఇంటి పేరు
దేవుళ్ళకు రూపు రాళ్లు-మా వూరి పేరు
గుళ్ళల్లో దేవుళ్లు
దేవుళ్ళకు రూపురాళ్లు
రాళ్ళతో చేసే దేవుళ్లు
రాళ్ళతో కట్టే గుళ్ళలో-నివాసం
రాళ్ళకు—దేవుళ్ళకు ఎంత సన్నిహితం!
మీ ఇల్లుకు మా పల్లెకు
అంతే సన్నిహితం!

(మిత్రులు దేవులపల్లి రామానుజరావు గారి నుద్దేశించి

# కృష్ణశాస్త్రి

విప్లవానికి ద్వారం తెరిచావు
సంఘసేవకు దారి చూపావు
స్వాంతానికి స్వస్తి చెప్పావు
సమాజశ్రేయస్సే కలంలో నింపావు
సందేశాలను అందించావు
దేశప్రజలను ఉత్తేజపరిచావు
ఇంటింటా నీ కవితలు వెలిగించావు
ప్రతినోటా నీ పాటలు పాడించావు

సంస్కరణలె ఆదర్శం చేశావు
సౌందర్యాన్నే ఆరాధించావు
కవితకు నవతను చేకుర్చావు
సరస్వతి పాదాలకుతొడిగావు స్వర్ణమంజీరాలు

(దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి సంస్మరణ సందర్భంగా)

# కలలో - ఇలలో

కలలో—

అందాల పూలబాట జీవితం

ఎందాక బోయినా

జీవితమే ఒక పూదోట

ఇలలో—

అంతా వంకర టింకర

డొంకల బాట

ముళ్ళతో నిండిన

పల్లేరు తోట

సుఖ దుఃఖాల కంబళ్ళబొంత

ఆశయంలో—

అంతా ఒక స్వర్గం

ఆలోచనలో అన్నీ ఉంటాయి

అమల్లో—

ఇంట్లో ఉండదు సుఖం

ఒంటికి బట్ట, కడుపుకు అన్నం

అన్నీ సున్నా.

# గోల - లీల

గోల గోల ఎటుచూసినా గోల
ఆకాశంలో విమానాల గోల
నేలన మనుషుల గోల
రోడ్డు పై మోటార్ల గోల
నీటిలో నావల గోల
హోటల్లో పాటల గోల
ఆటల్లో పాత్రల గోల ॥గోల॥

ఇంట్లో పిల్లల గోల
బయట పెద్దల గోల
నీటిపంపు దగ్గర గోల
గుడిలో పురోహితుల గోల
గుడివెలుపల బిచ్చగాళ్ళ గోల ॥గోల॥

కాలేజీల్లో విద్యార్థుల గోల
ఫ్యాక్టరీల్లో కూలీల గోల
దుకాణాల్లో ఖాతాదార్ల గోల

లోకమంతా గోల
ఇదే నా పై వాడి లీల!

# విశ్రాంతి - క్రాంతి

పనిని పూర్తి చేయడమే విశ్రాంతి
సమయాన్ని సరిగా ఉపయోగించడమే విశ్రాంతి
ఉపయోగంగా కాలాన్ని గడపడం విశ్రాంతి
సోమరితనం కానేరదు విశ్రాంతి
సమయాన్ని సంహారించడమే సోమరితనం
కాలాన్ని వినియోగించడానికి అందమైన ప్రణాళికే
విశ్రాంతి

విశ్రాంతి అందమైన ఆభరణం
కాని పనికిరాదు ఎల్లవేళల ధరించడానికి

ఆలోచనకు మాత్రమే విశ్రాంతి
మానవ జీవితరంగంలో,
దృశ్యాల మార్పిడియే విశ్రాంతి
శ్రమించిన తరువాత పొందే విశ్రాంతి
బంగారు దినం, తియ్యని స్వప్నం!

అవసరమైన విశ్రాంతి
జీవితానికి క్రాంతి!

# వికసించదా వినోద పుష్పం

కోట్లకొలది ప్రజలకు
నడిదారి ఒడ్డులే నివాసాలు
ఎంగిలి మెతుకులే వాళ్ళ విందుభోజనాలు
చింపిరి పాతలే వాళ్ళ చీనాంబరాలు
పచ్చిదుంపలే వాళ్ళకు పండుగ విందులు

వాళ్ళ కష్టమే ఉన్నవాళ్ళ సుఖానికి పునాది
వాళ్ళ చెమటలే వీళ్ళ వేడి రక్తం
వాళ్ళకింత వీళ్ళసహాయం, సానుభూతి అందితే-
అంకురించదా ఆనంద బీజం?
చిగురించదా చింతలులేని జీవితం?
వికసించదా వినోద పుష్పం
మరి ఎదగదా మానవత్వం ఈలోకంలో?

# ప్రశంసనీయం! శోచనీయం!

ఉన్నవారి ధనార్జనను
ఇనుమడింప చేయడానికి
లేనివాళ్ళెప్పుడు తోడ్పడడం
ఎంత విచిత్రం! ఎంత ప్రశంసనీయం!!

లేనివాళ్ళ స్తోమతిని
తగ్గింప చేయడానికి
ఉన్నవాళ్ళు ఎల్లప్పుడు కృషిచేయడం
ఎంత విచిత్రం! ఎంత శోచనీయం!!

# మీరు - మేము

మీకూ మాకూ ఎంతో తేడా
మనం కలిసేది ఇంక ఏడా

మీరు పోతారు ఉప్పర్
మేము ఉంటాము నీచే ||మీకూ||

మీరు దొరటొళ్లు అండీ
మేము బానిసోళ్ళం అండీ ||మీకూ||

మీరు అమీరోళ్లు అవుతే
మేము గరీబోళ్ళం కాదా ||మీకూ||

మీరు ఎక్కుతారు బడాగాడీల్లో
మేము నడుస్తాం మంచిగ నేలమీద ||మీకూ||

# దేవుడు - మనిషి

పుస్తకంలాగే దేవుడు—
ప్రతి ఒక్కడూ చదువుకోవాలి
తమకు తామే.

మనిషికి దేవుడు మనిషిలా ఉంటే
చీమకు, దోమకు ఎలా ఉండాలి?
మన తెలివిని బట్టి
ఉనికిని కల్పిస్తాం దేవుడికి.

స్వలాభానికే పూజిస్తాం దేవుణ్ణి
కష్టాలు లేనినాడు
కన్పించడు దేవుడు మనిషికి!

# హిప్పీలం - హిప్పీలం

హిప్పీలం - హిప్పీలం
గప్పాలెన్నో కొట్టే వాళ్ళం
గొప్పలెన్నో చెప్పే వాళ్ళం
మెప్పులెన్నో పొందే వాళ్ళం ||హి||

ఎందరికో మసి పూస్తాం
అందరినీ మురిపిస్తాం
హిందీ ఇంగ్లీషు బోల్తాహుం
తెలుగు తమిళం జాన్తానహీ ||హి||

తప్పులన్నీ మెప్పులు మాకు
తప్పులు-ఒప్పులు-పేదలు-ధనికులు
సర్వ సామ్యము-సోషలిజం
సరిగా పాటిస్తాం హిప్పీలం- లం- లం-

పొడుగు జుట్టులు పెంచేస్తాం
పొట్టి బట్టలు కట్టేస్తాం
చింపిరి బట్టలు-అతుకుల బొంతలు
పొడుగు-పొట్టి
ఒదులు బిగువు అంతా ఒకటే
భేదం లేదు ||హి||

దువ్వని తలలు
ఉతకని బట్టలు

తడబడు అడుగులు

తూలే తలలు

మాయని మనసులు

మాసిన దుస్తులు

మా కెంతో ఆనందాన్నిస్తాయి ॥హి॥

పుట్టినప్పుడు బట్టే లేదు

మట్టిలో కలిసేటప్పుడు బట్టే ఉండదు

(ఈ) మధ్యలో కట్టేదెందుకు బట్ట?

ఇందువదనలు చంద్రబింబములు

కందిపోదురీ బట్టల బరువుకు

తలుపులు లేని ఈ జగము నందున

వడలు మూయుట వెర్రితనము కాదా? ॥హి॥

రాజకీయాలను రానీయము జోలికి

వ్యాజ్యాలు వివాదాలు లేసే లేవు

ఏ కులమని ఏమతమని

వేధించెదరీ లోకులు, పలుగాకులు

కులమేలా మతమేలా

గుణమే మేలు మనసే చాలు ॥హి॥

దమ్మిస్తే పీల్చుకొని

గమ్మున నోరు మూసుకొని

కమ్మగ కాలం గడిపేస్తాం
సోమరిజం పేరు చెప్పేస్తాం
సొంత డబ్బా వాయిస్తాం ॥హి॥

శాంతి సేనలము
విశ్రాంతిలేని వారలము
యుద్ధం వస్తే సిద్ధం మేము
దమ్ము పీల్చుకోని
పగవాణ్ణి దుమ్ము చేస్తాం
రాజ్యాన్ని రక్షిస్తాం
దేశాన్ని గెలిపిస్తాం ॥హి॥

# వెర్రిబావ

వెర్రివాడె చెల్లి
బావ వెర్రివాడె
కుర్రవాడె
బావ వెర్రి కుర్రవాడె
అల్లరి తెలియని పిల్లవాడె
చిల్లర ఎరుగని బుల్లివాడె ॥వెర్రి॥

చిలిపి చేష్టలు చేయలేడె
వలపుల బాణాలు వదలలేడె
నోటిలో వేలిడితె కొరకలేడె
పోటివారితో మాటాడ లేడె ॥వెర్రి॥

ప్రేమంటే తెలియనోడె
కన్నెపిల్లంటే ఎరగనోడె
ఇంతిమనసు తెలియలేడె
ఎంత మంచి వెర్రివాడె ॥వెర్రి॥

అల్లరి మరదళ్ళంతా కలసి
బావను పట్టుకు తంతేను
బావురు మంటాడె
బావకు గిలిగింతలు పెడితే
పక్కకు తొలిగేస్తాడె ॥వెర్రి॥

ముద్దు నిమ్మంటే. బావ
ఒద్దు లెమ్మంటాడె
వద్దకు రమ్మంటే, బావ
ఇప్పుడు కాదు లెమ్మంటాడె ॥వైరి॥

డూడూ బసవన్నంటె
దుముకుతు వస్తాడె
పత్తిగింజలు రుబ్బిపెట్టితే
బావ బాగుగ పట్టుపడతాడె
కడుపు నిండితే కాలం గడిపేస్తాడె
కామ క్రోధ మద మాత్సర్యాలను
కాండన్ని వేస్తాడె ॥వైరి॥

వేదాంతం వినడానికి
రంకెలు వేసి
గంతులు కొడతాడు

డూడూ బసవన్న
ప్రేమ పెళ్ళి మనకెందుకు గంగన్న
ప్రత్తిగింజల పట్టు విడువకు
మరదలుపిల్ల మోము జూడకు
ఆకలి తీరును
ఆనందం చేకూరును! ॥వైరి॥

# దొంగలు - గజదొంగలు

దొంగలు గజదొంగలు
దొంగలొస్తున్నారు
అందరూ బహుపరాక్ ||దొం||

దొంగలొస్తారు, దోచుకుంటారు
కాచుకోండి, దాచుకోండి
ఉన్నదంతా. మీకున్నదంతా.
ఉన్నదేదో లేని వారికి పంచి ఇవ్వండి
లేకుంటే మీకు బుద్ధిచెప్పే దొంగలండీ
చెప్పి వచ్చే దొంగలు
చేసిచూపే దొంగలు
నిలువునా దోచుకుంటారు ||దొం||

కన్నులముందే కంఠం నొక్కి
కబళిస్తారు మీకున్నది
వైనం తెలిసి ఉన్నదేదో
పంచిపెడితే
ఊరక వదిలేస్తారు ||దొం||

మీ దనుకున్నది
అందరి సొత్తని చాటించే దొంగలు
కళ్ళముందే ఇళ్లుదోచే దొంగలు
మంచివాళ్ళకు
అడగక ముందే పంచిఇచ్చే వాళ్ళకు
బహుమంచిమిత్రులీ దొంగలు ||దొం||

ధనం పాతిపెట్టిన వాళ్ళకు
నీతినేర్పే దొంగలు
దొంగతనానికి అర్థం మార్చే దొంగలు
మారు వేషం లేని దొంగలు
మనసులు మార్చే దొంగలు
దొరలను మించిన దొంగలు
దొరలకు దొంగకు తేడా తెలిపే దొంగలు ॥దొం॥

దొంగలంటే దొంగలా
భలే ఘరానా దొంగలు
ముసుగులు లేని గజదొంగలు
దొరలకు బుద్ధినేర్పే భలే దొంగలు ॥దొం॥

# ఘుమ్మని - రమ్మని

ఘుమ్మని వీచే చల్లని గాలి
రమ్మని పిలిచే రంగుల డోలి
రోజారంగుల చెక్కిళ్లు
తాజాకలువల కనుదోయి
ఉలిపిరిపొర దుస్తుల్లో
ఉలిక్కిపడే పరువాలు ॥ఘు॥

కమ్మని బందరు కారా కిళ్లీ
ఘుమ్మని పారిస్ అత్తరు సెంటు
వేసుకో కారా కిళ్లీ
పూసుకో పేరిస్ అత్తర్
చూసుకో వాటి తమాషా! ॥ఘు॥

అందాలొలికే చందురుడు
హాయిని గొలిపే పున్నమిరేయి
వలపులు కురిసే
విరపూసిన వెన్నెల
తలపులు మొలకెత్తించే
తరుణ వయస్సు!
కనువిప్పి చూసుకో
మనసిప్పి చేసుకో
అంతా నీ సొంతం! ॥ఘు॥

# ప్రతిరూపం

ప్రేమ కారణా అడుగదు
ఇవ్వడమే ప్రధానం ప్రేమకు
ప్రేమ పెరుగుతుంది కలిసి పడిస్తే-
ప్రేమంటే—
ప్రకృతి అల్లిన కుట్టుపని!
సృష్టి రచించిన చిత్రపటం!
ప్రేమకు పారితోషికం ప్రేమే
ప్రేమ ప్రతిరూపం దైవానికి!

# నిత్యం - సత్యం

మార్పు తప్ప
మరణం, నాశనం, తేనేలేవు!
రూప నామాలు మాత్రమే
మారుతాయి చావుతో.

కనిపించని దాన్ని
నశించిందంటున్నాం!
మరణం శరీరానికే
లేదు మార్పు ఆత్మకు!

జీవితం క్షణికం
చావు నిత్యం
జీవితం సత్యంలో భాగం
చావే సత్యం!

# ఆలితో అబద్ధం

భర్తలు–భర్తలు
భర్తలు అనేకరకాలు!
అబద్ధాలు చెప్పే భర్తలు
బాగా రాణిస్తారని ప్రతీతి!
నిజం చెప్పే భర్తలు
నిష్ఠూరం పడతారు.
నిజం చెపితే
నమ్మే భార్యలెవరు?
అబద్ధాలు చెప్పే భర్తలు
ఆవకాయ ముక్కల్లా కమ్మని కారంతో
మసాలాచొప్పించి చెప్పగలిగేవాళ్లు కొందరు!
చెప్పలేక వంటఇంట్లో కుందేలులా
భార్యల చేతుల్లో చిక్కేవాళ్లు కొందరు!
అబద్ధానికున్న విలువ
భార్యల ముందే కాక
ఎవ్వరి ముందూ, ఎన్నడూ
నిజానికి లేనే లేదు!
మరి ఆలితో అబద్ధం ఆడకుంటే
కాదా సారంలేని సంసారం!

# పొంగడం - కృంగడం

ఆశించిన ఫలితం సంభవిస్తే పొంగడం
అది పొందకుంటే కుంగడం!
"పని మీద దృష్టిపెట్టుకో
ఫలితంపై దృష్టి నాకు వదులు"
అన్నాడు భగవానుడు
అయిన దానికి ఆనందించు
కాని దానికి చింతించకు
అన్నాడు ఆ కృష్ణ పరమాత్ముడే
అందుకే అంటాను
పొంగకు దేనికీ
కుంగకు దేనికీ, అని.

# ప్రత్యక్ష దైవం

దేవుడు సర్వత్రా
ప్రత్యక్షం కావడం
దుర్లభం కనుక —
ఎల్లవేళల పిల్లలకు దైవంగా
తల్లిని సృజించాడు.

## అందాల దొంగ

ప్రేమ ధనాన్ని పెంచాలి
యోగ్యత నెరిగి వాడాలి
ప్రేమ గుడ్డిదే కావచ్చు
ప్రేమ చూడలేనిది లేనేలేదు.
దానికి హస్తాలు సహస్రం
స్పృశించగలదు దేనినైనా—
దాస్తుంది లోపాలను ప్రేమ
దోస్తుంది అందాలను ప్రేమ!

# గమ్యం - రమ్యం

గమ్యానికి చేరే రహదారికి
అడ్డుగోడలు పెట్టకు
ముళ్ళ కంచెలు పెంచకు
కందకాలు తవ్వకు
ముందు వెళ్లినవారు చూపిన బాట
వెనుక నడిచేవారికి
కావాలి రమ్యమైన రహదారి
దానికి సమకూర్చాలి చక్కని ప్రవేశం
అందరి ప్రయాణం
కావడానికి సుఖదాయకం

# పన్నుగడ

ఉచిత సలహాలకు
ఖర్చేముంటుంది
అది మనం అమలు పరచవలసివస్తే తప్ప!

ఇతరులను సలహా అడగడమంటే
మనలను పొగడడానికి
వేసే మంచి పన్నుగడే కాదా?

సలహా యివ్వగలమే గాని
మనుష్యులను మార్చగలమా?

# గోవా - గొప్పలు

గోవా వెళ్లాను
గొప్పలెన్నో చూశాను
అడుగడుగునా మేరిమాత గుడులు
ఎటు చూసినా ఏసునాథుని శిలలు
అన్ని వైపులా సముద్రపు అలలు
అనేకాలు ఇనుపరాతి గనులు.

అతివలు మత్స్య కన్యలు
పైకి ఎగదోపిన పరికిణీలు
పమిట లేని పసందైన చోళీలు
తంజావూరి భరతనాట్యబొమ్మల్లా.

అడుగడుగునా బీరుల బారులు
అందర్నీ మురిపించే గోవా వీధులు
కలన్‌గూట్ బీచ్‌లో
హిప్పీల మూకలు
అగోడా కోటలో
పోర్చుగీసు నాటి వింతలు!

# (స్వ) ప్రేమ

ప్రేమలోంచే పుట్టావు నీవు
నీ ఉనికికి స్థానం ప్రేమే
నీ హృదయంలో ప్రవహించే జీవనధార ప్రేమ
తప్పొప్పుల జాబితా వేయకుండా
మనిషిని మనిషిగా ఒప్పుకోవడమే ప్రేమ
ఉనికిని గుర్తించడమే ప్రేమ
ప్రేమ కావాలన్నా
ప్రేమను తెలుసుకోవాలన్నా
మనలను మనం ప్రేమించుకోవాలి.
స్వప్రేమ అంటే–
నిన్ను నీవు గుర్తించుకోవడం
ప్రశంసించు కోవడం.
నీ చర్యలకు అంగీకారం స్వప్రేమ.
అది–నీ శక్తి సామర్థ్యాల్లో నమ్మకం.
దోషం అనుకోకుండా నీకు నీవు
సంతోషాన్నిచ్చు కోవడం
నీ శరీరాన్ని ప్రేమించడం
తరచు శరీరమర్దనం కావించుకోవడం

నీ అందాన్ని అభినందించడం
అర్హుడననే ఉద్దేశంతో
నీకు కావలసిందాన్ని ఇచ్చుకోవడం స్వప్రేమ

స్వప్రేమ-నిన్ను గెలుచుకోనివ్వడం
ఒంటరితనానికి లొంగక
ఇతరులకు నీలో తావివ్వడం
నీ అంతర్వాణిని అనుసరించడం
బాధ్యతతో నీ స్వంత నియమావళి ఏర్పరచుకోవడం
నీ పరిపూర్ణతను తెలుసుకోవడం స్వప్రేమ
నీవు చేసినదానికి పేరుతెచ్చుకోవడం
పేదరికంలో నిలిచి పోకుండా
సౌభాగ్యానికి సోపానాలు వేయడం.

ఎనలేని మిత్రులను సృష్టించుకోవడం.
నిన్ను నీవే నమ్ముకోవడం-స్వప్రేమ
మంచి ఊహాలతో నిన్ను నీవు పోషించుకోవడం
ఇతరులతో సమానంగా నిన్ను చూచుకోవడం
నిన్ను నీవు క్షమించుకోవడం

ఆదరాభిమానాలకు తావివ్వడం-స్వప్రేమ
అది-నీపై అధికారం-ఇతరుల కివ్వడం కాదు

నీ క్రియాశక్తిని అభివృద్ధి చేసుకోవడం
ఎల్లవేళల హాయిగా ఉండటం
నీతో నీవు మెల్లగా, ప్రియంగా మాట్లాడుకోవడం!

స్వప్రేమ-నీలోని మాతృ, పితృభావాలకు
అంగీకారం

నీలోని చెడు ఆలోచనలను మంచి
ఆలోచనలుగా మార్చడం!

స్వప్రేమ నిన్ను శిక్షించుకోవడంకాదు
అది నిన్ను బహూకరించుకోవడం।

# కష్టాలు లేనినాడు!...

పుస్తకంలాగే దేవుడు
ప్రతి ఒక్కరూ చదువుకోవాలి
తమకు తామే.

మనిషికి దేవుడు మనిషిలా ఉంటే
చీమకు దోమకు ఎలా ఉండాలి?
మన తెలివినిబట్టి
ఉనికిని కల్పిస్తాం దేవుడికి

స్వలాభానికే పూజిస్తారు దేవుడ్ని
కష్టాలు లేనినాడు
కన్పించడు దేవుడు
ఏరు దాటడానికే
తెప్పను వాంఛించడంలా

# అన్నీ కష్టాలే

అమ్మాయి పెండ్లికి
అబ్బాయి చదువుకు
భూమి ఆడుమానం
ఆస్తి అమ్మకం
అటు తర్వాత
అల్లుడు చేసే గొడవలు
అమ్మాయి పడే బాధలు!
అబ్బాయి పరీక్ష ఫెయిల్ అయితే
ఆడుమానం భూమి అప్పులవాడి పాలు
అన్నీ అవక తవకలు
అనుకొన్నదొకటి
అయ్యేది మరొకటి—
అన్నీ కష్టాలే
పిల్లల కన్న అయ్యకు అమ్మకు—
తలుచుకుంటే ఆ తల్లితండ్రుల కడగండ్లు
తరుక్కుపోతుంది కడుపు
ఆవేశం నెట్టుకొస్తుంది
ఆందోళన రేకెత్తుతుంది
అన్నీ కష్టాలే
ఎక్కువ పిల్లలకన్న అయ్యకు, అమ్మకు.

# రుచి - మేలు

ఏది రుచి ఏది మేలు
కల్లు, కాఫీలలో?

కల్లు-చెట్టు రసం
కాఫీ-గింజ రసం
కాఫీలో ఉంది - ''కాఫీన్''
ఆరోగ్యానికి పరమ శత్రువు
కల్లులో ఉంది ఆహార పదార్థం
అంటారు ఆరోగ్యానికి అది మంచిదని-
ఊరికి కల్లుదుకాణం ఒకటే ఐతే
కాఫీ క్లబ్బులు వుంటాయి కావలసినన్ని వీధివీధికీ
మంచి కల్లు కనిపించని మిత్రుడు అయితే
కాదా కాఫీ కనిపించని శత్రువు?

# డార్జిలింగ్ పట్టణం - డార్లింగ్ నగరం

డార్జిలింగ్ పట్టణం
నిజంగా డార్లింగ్ పట్టణం!
ఎండలు భరించలేనివారు
కొండలెక్కి చేరితే డార్జిలింగ్
చేకూరుతుంది ఎంతో కూలింగ్!
అక్కడ కప్పుకోను ఉన్నిదుస్తులున్నవి
పూసుకోను పన్నీరున్నది
తీసుకోను కమ్మని మధుపానీయాలున్నవి
కాచుకోను వేడి కుంపట్లున్నవి
అచటి వనితలు
అప్సరల మించిన వనరాణులు
ఆనందాల పంచే డార్జిలింగ్
అందాల మురిపించే డార్లింగ్!

# సవాలు

జీవితం ఒక సవాలు-ఎదుర్కోవాలి దాన్ని
జీవితం ఒక ప్రేమ - రుచిచూడాలి దాన్ని
జీవితం ఒక స్వప్నం - అమలుపరచాలి దాన్ని
జీవితం ఒక పందెం - ఆడి గెలవాలి దాన్ని
జీవితం ఒక స్వర్గం - అనుభవించాలి దాన్ని
జీవితం ఒక సాగరం - ఈది దరి చేరాలి సురక్షితంగా
జీవితం ఒక వనం - పెంచాలి ఫల పుష్పాలను
జీవితం ఒక తటాకం - నింపి అందివ్వాలి నీటిని ప్రాణి
కోటికి

జీవితం ఒక మధురానుభూతి - పంచుకోవాలి అందరితో

ఎంత కష్టమైనదైనా జీవితం - ఆశ్చర్యం! అమూల్యం!!
బాధ్యతా నిర్వహణ జీవితానికి అందాల ఆభరణం!
ఆనందాల మాలికల డోల!!

క్రూరత్వం, పగ, అసూయలు జీవితానికి జాడ్యాలు
అజ్ఞానం, మూర్ఖత్వం మనసుకు మబ్బు పొరలు
మంచితనం, మానవసేవ, ఓర్పు, ప్రేమలు
జీవితానికి అమృత తుల్యాలు
విజ్ఞానం, హేతువాదం మనిషికి మాణిక్య కిరీటాలు

# దేవుడు లేడంటారా?

దేవుడు లేడంటే నమ్మేదెలాగు?
కల్తీ సిమెంటుతో కట్టిన ఎన్నో అంతస్తుల
మేడలు వెంటనే కూలి పోవడం లేదంటే,
కల్తీ నూనెతో చేసిన వంటలు తిని
మనుషులు మరుక్షణంలో మరణించడం లేదంటే—
దేవుడు లేడని ఎలా, నమ్మడం?

ఈ గడ్డు దినాల్లో అధిక ధరలు
నల్లబజారు నిచ్చెన మెట్లపై
ఆకాశాన్ని అంటుకుంటుంటే,
పేద ప్రజలు నిస్సహాయులై
నిత్యం పస్తులతో ఇంకా బ్రతుకు బండిని
పడుతూ లేస్తూ నడుపుతున్నారంటే
దేవుడు లేడంటారా?

కరెంటు రోజుకు ఎన్నిసార్లు ఆగినా
రైళ్లు ఆలస్యంగా నడిచినా
బస్సులు అసలు నడవకున్నా
టెలిఫోన్లు ఎన్నో రాంగ్ నంబర్లు మోగుతున్నా

ప్రజలు నిత్యం జీవితరథాన్ని ఎలాగో లాగుతున్నారంటే
మరి దేవుడు లేడంటారా?

ఆఫీసులు వేళకు తెరవకున్నా
ఫైళ్ళు అసలు కదలకున్నా
సమ్మెలు సాగుతున్నా
పన్నులు తగ్గకున్నా
వానలు కురవకున్నా
కరువులు తీరకున్నా
దేశం ముందుకు సాగుతునే ఉందంటే
మనిషి జీవితం మందకొడి దివ్వెలా వెలుగుతుందంటే
అంతా మనకు తెలియని ఆ "పై" వాడి
ఉనికి కాదంటారా?

జ్యోతిష్కులు పెద్దవారి ఆశీర్వాదాలతో
వర్ధిల్లు తున్నారంటే
బాబాలు మాయా విభూతితో పాటు
బంగారు ఉంగారాలు, స్విస్ గడియారాలు
గాలిలోంచి తెప్పించి ఉన్నవారికే ఇస్తున్నారంటే
మరి ఆతడి మాయ కాదంటారా?

పచ్చి రక్తం పీల్చే నరరాక్షసులు

పచ్చని యువశక్తిని పైకిరాకుండా మాడ్చేస్తున్నా

సంఘాన్నే మింగే తిమింగలాల కోరలకు పదును

ప్రతిరోజు పెంచుతున్నా

న్నిచోట్ల దోపిడీలు, అత్యాచారాలు అమితంగా

జరుగుతున్నా

ప్రజల జీవితం ఎడ్లబండిలా కదులతూనే ఉందంటే

దేవుడు లేకుండా ఎలా ఉంటాడు?

కాలేజీలు నడవకున్నా, కాపీలు జరుగుతున్నా

పరీక్షలు జరుగుతున్నాయంటే

విద్యార్థులు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులౌతున్నారంటే

మరి దేవుడు ఉండి ఉండాలికదా!

వారంరోజుల కర్ఫ్యూలో వంటింట్లో పిల్లికదలకున్నా

కుయ్యి కయ్యనకుండా మనిషి బతుకుతున్నాడంటే

కత్తిపోటుకు కడుపులో పేగులు బయటికి వచ్చినా

ఆస్పత్రిలో అడ్మిషన్, ఆపరేషన్లు ఆలస్యమయినా

మనుషులు చావకుండా బతికి బయటపడుతున్నారంటే

దేవుడు లేడంటే ఎలా నమ్మడం?

దోపిడి దొంగలుకూడా దేవుడికి కట్నాలు చెల్లిస్తున్నారంటే

నక్సలైట్లుకూడా దైవభక్తులు అవుతున్నారంటే

మరేమంటారు?

మరి దేవుడు లేడంటారా?

మీరు కాదంటారా?

# జీవిత భాండం

సుఖదుఃఖాల
కావడి కుండల
కదలికే జీవితం-
చీకటి వెలుగుల
పడుగు పేకల
నేతయే జీవితం-

మంచి చెడ్డల
తక్కెడ తట్టలే
జీవితం-

ఎగుడు దిగుడుల
కొండ కోనలే
జీవితం-

తీపి చేదుల
రస మిళితమే
జీవితం-

పడుగు పేకల కలయిక
వస్త్రానికి ప్రాణం లాగే
సుఖదుఃఖాల అవినాభావమే
జీవిత భాండం!

# వింత జీవి

మనిషి జీవించడానికి ఏంకావాలి?
తినడానికి కావాలి తిండి
కట్టుకోను కావాలి బట్ట
ఉండను కావాలి గూడు

కాని మనిషికి కావలసింది అవే అయినా
మనిషి కోరుతాడు ఎనలేని భోగాలను
అన్నం అతిరుచిగా ఉండాలని
వలువలు ఎంతో విలువైనవి కావాలని
గృహం స్వర్గధామంగా కన్పించాలని
తాపత్రయ పడతాడు మనిషి!

పాత బట్టలు కట్టితే
పలువురిలో నామూషి మనిషికి!
సాధారణ కష్టటింట్లో
చేయలేడు సంసారం మనిషి!

అంతులేని కోర్కెలకు
గంతులేసి దాసుడవుతాడు మనిషి
ఎంతవున్నా తృప్తిచెందడు
వింతజీవి మనిషి !

# పెళ్ళినాటి ప్రమాణాలు!

"మాంగల్యం తంతు నానేన మమజీవన........."
అంటూ చేయిస్తాడు ప్రమాణం పురోహితుడు
వరుడిచేత మంగళసూత్రం కట్టిస్తూ.........
అంటే-'ఓ వధూమణీ! మనం జీవించినంతకాలం
నిన్ను నా సహధర్మపత్నిగా స్వీకరిస్తూ ప్రేక్షకులముందు
మంగళకరమైన తాడును నీ మెడకు కడుతున్నాను"
-అని ప్రమాణం!

మరో "మంచి" ప్రమాణం!
ధర్మాచరణయందుకాని
అర్థార్జనయందుకాని
కామానుభవమందుకాని
మోక్షసాధనయందుకాని
నీవు నా భాగస్వామినివి
వాటి ఆచరణల్లో నిన్ను విడచి
అన్యధా చరించను-అని!

ప్రమాణం పెండ్లినాడు మాత్రమే
ఆచరణలో అంతా తారుమారే!
'నాతిచరామి' నామ-మాత్రమే!

# మారునా

మారునా మనుషుల తత్వం
మారునా సూర్య చంద్రుల గమనం?

వక్రబుద్ధులు సరిదిద్ద నగునా
తొర్రిగుణాల మాయడం వెర్రితనం గాదా?
కుక్కతోక చక్కగ నిలుచునా
గొడ్డుతోక బారెడు సాగునా
పాము కోరల్లో విషం తేనెగా మారునా
పులి గోళ్లల్లో వాడి మందగించునా?
మూర్ఖులచెవిలో మంచి మాటలు దూరునా
అసూయాపరులు అందాన్ని ఓర్వగలరా?
మంచిని చూడలేనివాళ్లు మనుషులా
మనిషిని మృగంగా చూచేవాళ్లు మానవులా?

# తప్పని ముగింపు!

మనిషి పుట్టిందెందుకో?
జీవించడానికి మాత్రం కాదు
జీవించాలనుకొని మరణించడానికే!

మనిషేస్తాడు ప్రణాళిక ప్రతిపనికీ
జీవితానికి తప్పని ముగింపైన
మరణానికి మాత్రం తప్పు!
మనిషికోరేది శాశ్వతంగా జీవించాలనే
కాని దాపురిస్తుంది మృత్యువు తప్పనిసరిగా!
జీవితమంతా సుఖంగా గడపాలని కోరుతాడు
కాని అనుభవించేది దుఃఖాలనే!
ఈ కోర్కెలకు మార్గం తప్పని ముగింపే!

ముసలితనం ముంచుకొస్తున్నా
స్వాగతం చెప్పడు స్వార్థపరుడు మనిషి!
"తప్పని ముగింపు" తరుముకొస్తున్నా
తయారు కాడు మూర్ఖుడు మనిషి!
ఏక్షణానికైనా ముంచుకొచ్చే
"చావు" అనే నిజానికి మాత్రం
కళ్లుమూస్తాడు గట్టిగా ఎందుకో!

## ..........చివరి మాట

జీవితవలయాలు, మనిషికి మనిషి, కాలం వెంట కవి, పాపా నీకు తెలుసా? హంసధ్వని చదివిన వాళ్లకు తెలిసే వుంటుంది నేనెందుకు, దేని గూర్చి, ఎలా కవితలు రాస్తానో. ఈ "తప్పని ముగింపు" కూడా అలాగే రాసి ముగించాను.

ఎందుకు : అందరికీ కవితలు అందాలని

ఆధారం : అనుభవం-చూసింది, చేసింది, రాసింది.

శైలి : అందరికీ అర్థమయ్యే ప్రజల వాడుకభాష.

కారణం : గట్టులు తెంచుకొని ఉరకలువేసే భావ తరంగిణి.

ఈ "తప్పని ముగింపు" చప్పున వెలువడడానికి తోడ్పడిన శ్రీ వంశీ రామరాజు గారికి, చిత్తుప్రతులు చదివి సలహాలిచ్చిన డా॥ రావూరి వేంకట సత్యనారాయణరావు గారికి, ముఖచిత్రం చక్కగా రాసిన శ్రీ శీలా వీర్రాజు గారికి, పరిచయ వాక్యాలు వ్రాసిన డా॥ సి. నారాయణ రెడ్డిగారికి, శ్రీ ఇ. అయ్యపు రెడ్డి గారికి, తదితర మిత్రులకు నా కృతజ్ఞతలు.

1.12.82 - మీ మాలకొండయ్య

